# మహనీయుల జీవితాల్లో మధుర ఘట్టాలు

## ఓ సభలో గాంధీజీ

ప్రముఖుల జీవిత చరిత్రలు ఆసక్తిదాయకాలు. అయితే, సుదీర్ఘమైన జీవిత చరిత్రలు చదివే ఓపిక, తీరిక ఇప్పుడు చాలామందికి ఉండవు.

ప్రసిద్ధ వ్యక్తుల జీవిత చరిత్రలోని కొన్ని ఉపాఖ్యానాలు,హాస్యోక్తులు, ఆసక్తికరమైన సంఘటనలు మరపురానివి. అవి వినోదాన్నేకాదు, విజ్ఞానాన్ని, వికాసాన్ని కూడా కలిగిస్తాయి! కొన్ని సంఘటనలు, ఛలోక్తులైతే జీవితాంతం మరపురావు.

ముందుగా జాతిపిత మహాత్మాగాంధీతో ప్రారంభిద్దాం. రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యాన్ని తన ఆత్మ బలంతో, సత్యాహింసల ఆయుధాలతో ఎదిరించి, గెలిచిన మహాత్మాగాంధి చిన్నప్పుడు వట్టి పిరికి. నలుగురితో మాట్లాడాలన్నా, నలుగురితో కలిసి తిరగాలన్నా బిడియపడేవాడు.

రాజ్‌కోట హైస్కూలులో విద్యాభ్యాసానంతరం బారిష్టరీ చదవడానికి లండన్ వెడుతున్న గాంధీజీకి ఉపాధ్యాయులు, విద్యార్థులు వీడ్కోలు సభ జరిపారు. లండన్ క్షేమంగా వెళ్ళి లాభంగా రమ్మని ఉపాధ్యాయులు, విద్యార్థి నాయకులు శుభాకాంక్షలు చెప్పిన తరువాత వీడ్కోలు సన్మానానికి జవాబు చెప్పవలసిందిగా గాంధీజీని ప్రధానోపాధ్యాయుడు ఆదేశించాడు.

సమాధానం అనేసరికి గాంధీగారు గడగడ వణకడం ప్రారంభించారు. గుండెలు కొట్టుకోసాగాయి. అంతకు పూర్వం ఆయన బహిరంగ సభలో ఎప్పుడూ మాట్లాడి ఎరుగరు.

అందువల్ల, "నేను మాట్లాడలే"నని ఆయన చేతితో సైగచేసి కూర్చున్నారు. తోటి విద్యార్థులందరు గొల్లుమన్నారు!

తరువాత బ్యారిష్టరీ ప్యాసయి వచ్చిన గాంధీజీకి దక్షిణాఫ్రికాలోని ఒక కోర్టులో తన తరపున వాదించడానికి అబ్దుల్లా అనే క్లయింటు వకాల్తా ఇచ్చాడు.

కోర్టులో వున్న ప్లీడర్లను, క్లయింట్లను, జడ్జీని చూచేసరికి గాంధీజీకి ఎక్కడలేని భయం పట్టుకుంది. ముచ్చెమటలు పోశాయి. నోటమాట రాలేదు. తాను కోర్టులో వాదించలేనని గాంధీజీ భావించి, "నాకు ఈ వకాల్తా వద్దు, ఫీజూవద్ద"ని ఆ ఫైలును బల్లమీద కొట్టి కోర్టు నుంచి వెళ్ళిపోయారు.

అలా పదిమందిలో నోరు తెరవడానికి గడగడలాడిపోయిన గాంధీజీ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న తరువాత, లక్షలాదిమంది పాల్గొన్న వేలాది సభలలో అనర్గళమహోపన్యాసాలు చేశారు. తన వచో విభవంతో లక్షలాది భారతీయులను ప్రభావితులను చేశారు; వారిలో స్వాతంత్ర్యాగ్ని రగుల్కొలిపారు! ఆశ్చర్యం! తనకు జరిగిన సత్కారానికి నాలుగు మాటలలో సమాధానమైనా చెప్పలేని ఆయన 1947 మార్చిలో ఢిల్లీలో జరిగిన అఖిలాసియా రాజ్యాల మహాసభలో చేసిన మహోపన్యాసాన్ని విన్న వివిధ దేశాల ప్రతినిధులు ఆయనను "మహావక్త" అని ప్రస్తుతించారు.

ఆత్మ విశ్వాసంతో, దీక్షతో, పట్టుదలతో, సాధించలేనిది లేదని, సభా పిరికి అయినా సభాకేసరి కావచ్చుననడానికి మహాత్మాగాంధి జీవితంలోని ఈ రెండు సంఘటనలు మరపురానివి.

## నెహ్రూ నిజాయితీ

ఈ రోజులలో పరిపాలకులైన వారిలో అవినీతి, అక్రమాలు, బంధుప్రీతి, ఆశ్రిత పక్షపాతం, స్వార్థం పెరిగి పోతున్నవని సర్వత్రా విమర్శలు, ఆరోపణలు, పెచ్చరిల్లు తున్నాయి. అధికారంలో వున్నవారు చట్టాలను చుట్టాల ప్రయోజనాలకే వినియోగిస్తున్నారన్న విమర్శలు కూడా వినవస్తున్నాయి; రకరకాల "స్కామ్‌లే" అందుకు నిదర్శనాలు.

భారతీయుల ఆరాధ్య నాయకుడు, మన ప్రథమ ప్రధాని జవహర్లాల్ నెహ్రూ రాజకీయ జీవితం తొలి దశలోని ఒక సంఘటన రాజకీయవాదులందరూ మననం చేసుకోదగింది.

జవహర్లాల్ నెహ్రూ తన రాజకీయ జీవిత ప్రారంభదశలో అలహాబాద్ మునిసిపాలిటీ ఛైర్మన్‌గా ఎన్నికైనారు—1922లో.



ఒక రోజున పండిట్‌నెహ్రూ ఆఫీసులో కూర్చుని పని చేసుకుంటున్నారు. నీటి పన్ను వసూలు చేసే సూపరింటెండెంట్‌వచ్చి, కొందరు సకాలంలో నీటి పన్ను కట్టలేదని, నిబంధనల ప్రకారం అట్టి పౌరుల నీటి పంపుల కనెక్షన్‌లను రద్దుచేయాలని పేర్కొంటూ, అట్టివారి జాబితాను నెహ్రూ ముందు పెట్టాడు.

ఆ జాబితాను ఒక్కసారి ఆసాంతం చూచిన మునిసిపల్ చెయిర్మన్ నెహ్రూ పన్ను కట్టనివారి నీటి పంపులను తొలగించవలసిందేనని ఉత్తరువు చేశారు. సూపరింటెండెంటు తెల్లబోయాడు!

"పన్ను కట్టని వారిలో అలహాబాద్ హైకోర్టు చీఫ్ జస్టిస్, పోలీసు ఇన్స్పెక్టర్-జనరల్, ఇంకా ఎందరో ప్రముఖుల పేర్లు కూడా వున్నాయికదా! వారి నీటిపంపులను ఎలా తొలగించేది?" అని సూపరింటెండెంట్ భయపడుతూ నసిగాడు!

"ఎవరైతేనేమి? పెద్దవారికి ఒక రూలు, చిన్నవారికి ఒక రూలా? ఉన్నత స్థితిలో వున్నవారు విధి నిర్వహణలో ఇతరులకు ఆదర్శంగా వుండాలి. హైకోర్టు చీఫ్ జస్టిస్ అయినాసరే, పంపు కనెక్షన్ "కట్ చేయండి" అని నెహ్రూ గట్టిగా చెప్పాడు.

"ఆ జాబితాలో మీ ఇంటి కనెక్షన్ కూడా వున్నదండీ! చూడండి!" అని భయపడుతూనే అన్నాడు, తిరిగి సూపరింటెండెంటు.

"మా ఇంటి కనెక్షన్ అయినాసరే, పన్ను కట్టనప్పుడు నిబంధనల ప్రకారం చర్య తీసుకోవలసిందే!" అన్నారు నెహ్రూ.

సాయంత్రమయ్యే సరికి అలహాబాద్‌లోని నీటి పన్ను కట్టని సామాన్య పౌరుల కనెక్షన్లతోపాటు ప్రముఖులు, పెద్ద అధికారుల నీటి కనెక్షనులు కూడా తీసివేశారు. పట్టణమంతా గగ్గోలు!

రాత్రి జవహర్లాల్ ఇంటికి వెళ్ళేసరికి తండ్రి మోతీలాల్ నెహ్రూ ఆయనపై విరుచుకు పడ్డారు.

"మన నీటి పంపు కనెక్షన్ నా పేరుతో వుందని నీకు తెలియదా? కనెక్షన్ తీసి వేస్తామని నోటీసయినా ఇవ్వకుండా, మీ మునిసిపాలిటీ ఇలా చేయడం తప్పు కాదా?" అని ఆ తండ్రి కొడుకుపై ఎగిరి పడ్డారు. వెంటనే నెహ్రూ—

"బాధ్యులైన, ఉన్నతులైన పౌరులు సకాలంలో పన్ను కట్టకపోవటం తప్పు కాదా? పన్ను కట్టవలసిన తేదీ దాటిపోతోందని మీకు తెలియదా?" అని జవహర్లాల్

కూడా నిష్కర్షగానే సమాధాన మిచ్చారు. "పేదవారైనా, పెద్దవారైనా నిబంధన అందరికీ సమానమే" అని పండిట్ నెహ్రూ చెప్పిన జవాబుకు ఆ తండ్రి మొదట చిర్రుబుర్రుమన్నా, తరువాత తన కుమారుని న్యాయ దృష్టికి, నిజాయితీకి లోలోన సంతోషించినట్టు ఆ తరువాత నెహ్రూజీ ఒకసారి చెప్పుకున్నారు.

ఇప్పుడు అంత నిష్కర్షగా, నిష్పాక్షికంగా నిబంధనలను పాటించే పాలకులు యెందరున్నారు? అట్టివారికి చేతులెత్తి నమస్కరించవలసిందే!

## "మా ఊరిపై బాంబులు వేయండి"

ఇలాంటి ఉదంతమే ఒకటి అమెరికా స్వాతంత్ర్య సమరం సాగుతున్న రోజులలో జరిగింది. అమెరికన్‌లు 18వ శతాబ్ది చివరలో తమ స్వాతంత్ర్యం కోసం బ్రిటిష్‌వారితో పోరాడుతున్నారు. అది సాయుధ పోరాటం-అమెరికాలోని బోస్టన్ నగరంలో బ్రిటిష్ సైన్యాలను జార్జివాషింగ్టన్ నాయకత్వంలోని అమెరికన్ సైనికులు దిగ్బంధం చేశారు.

స్వాతంత్ర్య సమర సేనాని అయిన వాషింగ్టన్ అమెరికా పార్లమెంటుకు ఒక సందేశం పంపుతూ చక్రబంధంలో వున్న బోస్టన్‌పై బాంబులు వేస్తే కాని బ్రిటిష్ సైనికులు లొంగరని, అందువల్ల బోస్టన్ నగరంపై బాంబులు వేయడానికి అనుమతించాలని కోరాడు.

ఈ సందేశాన్ని పార్లమెంటు అధ్యక్షుడైన జాన్ హాన్‌కాక్ సభవారికి ప్రశాంతంగా చదివి వినిపించాడు. సభ్యులందరు దిగ్భ్రాంతి చెందారు. ఎందువల్లనంటే, పార్లమెంటు అధ్యక్షుడు హాన్‌కాక్ ఆస్తిపాస్తులన్నీ బోస్టన్ నగరంలోనే వున్నాయి. ఆ నగరంపై బాంబులు వేస్తే ఆయన ఆస్తులన్నీ ధ్వంసమైపోతాయి. అందుకు హాన్‌కాక్ మాత్రమే కాదు, యెవరైనా ఎందుకు అంగీకరిస్తారు? ఎలా సమ్మతిస్తారు?

సభికుల సందిగ్ధతను గమనించిన హాన్‌కాక్ గంభీరంగా లేచి నిలబడి—

"బోస్టన్ నగరంపై బాంబులు వేయడం వల్ల యుద్ధం ముగిసి, మన దేశానికి బ్రిటిష్‌వారి నుంచి స్వాతంత్ర్యం వస్తుందంటే అంతకంటే కావలసిందేమున్నది? నా సర్వస్వం పోతే మాత్రమేమి? బోస్టన్‌పై బాంబులు వేయడానికి వెంటనే ఉత్తరువు చేస్తున్నాను" అని ప్రకటించే సరికి సభ్యులు ఆయన దేశభక్తికి, త్యాగ నిరతికి జోహార్లు అర్పిస్తూ ప్రశంసాధ్వానాలు చేశారు!



## రాధాకృష్ణన్ చెప్పిన కథ

ప్రపంచ ప్రఖ్యాత భారతీయ తత్వవేత్త డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ గొప్ప వక్త, మహా పండితుడు. ఆయన డాక్టర్ రాజేంద్రప్రసాద్ తరువాత మన రెండవ రాష్ట్రపతి. ఆయన చమత్కార సంభాషణా చతురుడు. ఎదుటివారిపై సున్నితమైన చురకలు వేయడంలో దిట్ట.

ఒకసారి ఆయన పాల్గొన్న ఒక విందు సమావేశంలో ఒక ఇంగ్లీష్ పెద్దమనిషి తమ తెల్లజాతిని తెగ పొగడుతున్నాడు. అందులో నల్ల జాతులపై హేళన కూడా ధ్వనిస్తున్నది.

ఇది డాక్టర్ రాధాకృష్ణన్‌కు నచ్చలేదు. ఆ ఇంగ్లీషు పెద్దమనిషి "మా తెల్లవారిపై దేవునికి ప్రత్యేకమైన ప్రేమ. మమ్మల్ని ఎంతో జాగ్రత్తగా సృష్టించాడు. అందువల్లనే, మేము తెల్లగా, ఆకర్షణీయంగా వుంటాము" అన్నాడు.

వెంటనే డాక్టర్ రాధాకృష్ణన్ లేచి, "మిత్రులారా! దేవుడు ఒక రొట్టెను తయారుచేయదలచుకున్నాడు. ఆయన దాన్ని కాల్చగా, అది సరిగా కాలలేదు. కాలీ కాలకుండా వుంది. దానినుంచే ఈ తెల్లవారు వచ్చారు.

"ఆ రొట్టె సరిగా కాలలేదని, దేవుడు మరొక రొట్టె తయారు చేయదలచాడు. ఈసారి అది మరీ నల్లగా కాలి మాడిపోయింది. దానినుంచి నీగ్రో జాతులు పుట్టుకు వచ్చాయి. ఇలా కాదని, ఆయన మరొక రొట్టెను జాగ్రత్తగా, శ్రద్ధతో కాల్చాడు. అది సమపాళంగా కాలింది. దానినుండి భారతీయులు పుట్టుకు వచ్చారు" అనేసరికి ఆ శ్వేత జాతీయుని ముఖం వెలవెలబోయింది!

## కన్నకొడుకు పోయినా...

మహాకవి గురజాడ అప్పారావుగారి "కన్యాశుల్కం" నాటకంలో గిరీశం వెంకటేశంతో "నిన్ను సురేంద్రనాథబెనర్జీ అంతటివాణ్ణి చేస్తానోయ్!" అంటాడు.

సురేంద్రనాథ్‌బెనర్జీ బెంగాల్‌కు చెందిన గొప్ప దేశభక్తుడు. మన స్వాతంత్ర్యోద్యమ మహానాయకులలో ఒకరు. ఆయన శ్రోతలను వుర్రూతలూగించే వక్త. అందువల్ల, మన స్వాతంత్ర్య పోరాటం జరుగుతున్నప్పుడు ఆయన వాగ్విభవానికి ప్రభావితులై ఎందరో స్వాతంత్ర్యోద్యమంలో చేరారు.

సురేంద్రనాథబెనర్జీ స్థితప్రజ్ఞుడు. కష్ట సుఖాలను సమానంగా పరిగణించే వారినే స్థితప్రజ్ఞుడంటారు.

ఒకరోజు సాయంత్రం కలకత్తాలో ఆయన పెద్ద సభలో ఉపన్యసించవలసి వుంది. ముఖ్య ఉపన్యాసకులలో ఆయన ఒకరు.

దురదృష్టవశాత్తు, ఆ ఉదయం ఆయన కుమారుడు అకస్మాత్తుగా మరణించాడు. అంత దుర్భర దుఃఖభారంలో వున్న ఆయన ఆ సాయంత్రం సభకు రాలేడని అందరూ అనుకున్నారు సభ మాత్రం తక్కిన ఉపన్యాసకులతో యథాప్రకారం ప్రారంభమైంది. సరిగ్గా సమయానికి సురేంద్రనాథబెనర్జీ సభకు వచ్చేసరికి అందరూ విస్తుపోయారు. తనకు ఏమీ జరగనట్టే ఆయన మహోపన్యాసం చేసి వెళ్ళిపోయారు!

పుత్రశోకంతో పుట్టెడు దుఃఖంలో వున్న ఆయన కొడుకు పోయిన సాయంత్రమే సభకు వచ్చి మాట్లాడం ఆనాడు దేశంలోనే పెద్ద వార్త అయింది. స్థితప్రజ్ఞ అంటే అదే! దాన్ని మాటలలోకాక, ఆచరణలో చూపించిన మహామహుడు" సురేంద్రనాథ్ బెనర్జీ" అనేవారు!

## అణాకాసుపై ఆంధ్రత్వం

ఆంధ్ర నాయకులలో డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య మహామేధావి' అద్భుతమైన జ్ఞాపకశక్తి ఆయనది. వృత్తిరీత్యా డాక్టరు అయిన పట్టాభిగారు స్వాతంత్ర్యోద్యమంలో వృత్తిని వదిలి, గాంధీజీ అనుచరవర్గంలో అగ్రేసరుడైనాడు.

తెలుగువారికి ప్రత్యేక రాష్ట్రం కోసం ఆయన ఎంతో కృషి చేశారు. ఆ మాటకు వస్తే, తెలుగువారికే కాదు, భారతదేశంలో వివిధ భాషలు మాట్లాడే వారికి భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడాలని ఆయన పోరాడారు.

ఒకసారి కాంగ్రెసు వర్కింగ్ కమిటీలో ఆంధ్ర రాష్ట్ర నిర్మాణావశ్యకతను డాక్టర్ పట్టాభి వివరిస్తున్నారు. "ఉక్కు మనిషి" సర్దార్ పటేల్, పట్టాభిగారికి అడ్డుతగిలి "పట్టాభీ! ఆంధ్ర రాష్ట్రం, ఆంధ్ర రాష్ట్రం అంటావు! ఎక్కడ వుందయ్యా నీ ఆంధ్ర రాష్ట్రం. మద్రాసు రాష్ట్రంలో వుండే మీరంతా మద్రాసీలే!" అని ఎకసక్కెంగా అన్నారు.

వెంటనే డాక్టర్ పట్టాభి తన జేబులో వున్న ఒక అణాకాసు తీసి, "సర్దార్‌జీ!



మీకు తెలుగు ఎక్కడా కనిపించడంలేదా? ఈ అణాకాసులో "ఒక అణా" అని ఇంగ్లీషులో దేశంలో ఎక్కువమంది మాట్లాడే హిందీలోను, బెంగాలీలోను, ఆ తరువాత మా తెలుగులోను మాత్రమే వ్రాసి వుంది. మీ గుజరాతీ భాష ఈ అణాకాసులో లేదే" అనేసరికి ఆ "ఉక్కుమనిషి" నిరుత్తరుడైనాడు. మహాత్మాగాంధి మాతృభాష కూడా గుజరాతీయే! అయినా, ఆయన చిరునవ్వు చిందించారు. ఆ రోజులలో రూపాయికి పదహారణాలు. అందువల్ల, ఏ విషయాన్ని అయినా ఖచ్చితంగా చెప్పవలసి వచ్చినప్పుడు "పదహారణాల ఆంధ్రుడు" "పదహారణాల పచ్చి నిజం" అనేవారు!

## మూడు రూపాయల మునసబులు

ఇక, "ఆంధ్రకేసరి" టంగుటూరి ప్రకాశంగారి ధైర్యసాహసాలు, నిర్భయత్వం, త్యాగనిరతి, దేశభక్తి యావదాంధ్రులకేకాదు, యావద్భారతానికి తెలిసినవే.

ప్రకాశంగారు గొప్ప ప్లీడరు. కొంతకాలం ప్లీడరుగా రాజమండ్రిలో ప్రాక్టీసు చేసిన తరువాత లండన్ వెళ్ళి బారిష్టరు ప్యాసయి వచ్చారు.

అంతకు పూర్వం ఒకసారి రాజమండ్రిలో మునసబు కోర్టుకు ఆయన ఏదో కేసులో వాదించడం కోసం కూర్చున్నారు. ఒక కేసులో నిందితుడు తాను ప్లీడరును పెట్టుకోలేనని, పేదవాడినైన తనకు ప్లీడర్లకు పెద్ద ఫీజులిచ్చే తాహతులేదని విన్నవించుకున్నాడు.

వెంటనే ఆ మునసబుగారు "రాజమండ్రిలో ప్లీడర్లకేమిలోటు? వీధికి ముగ్గురు ప్లీడర్లున్నారు. రెండు, మూడు రూపాయలిస్తే ప్లీడరు వస్తాడు!" అని సలహా ఇచ్చాడు!

ఇది విన్న ప్రకాశంగారికి ఆగ్రహం కలిగింది. రాజమండ్రి ప్లీడర్లను అవమానించిన ఆ మునసబుగారికి బుద్ధి చెప్పాలని "అయ్యా! ఇప్పుడు రెండు, మూడు రూపాయలకు వచ్చే ప్లీడర్లు రాజమండ్రిలో లేరు. అలాంటి ప్లీడర్లందరు మునసబు ఉద్యోగాలకు వెళ్ళిపోయారు!" అని ప్రకాశంగారు అనేసరికి ఆ మునసబుగారి ముఖం సిగ్గుతో ఎర్రబడింది! ఆయన కూడా ఒకప్పుడు ప్లీడరే కదా!

## 40 గాడిదలు !

తెలుగువారిలో రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు గొప్ప అధ్యాపకులు. బ్రహ్మ సమాజ ప్రముఖులలో ఒకరు.

ఆయన బందరు కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తున్న రోజులలో ఒకసారి విద్యార్థుల కాంపోజిషన్ పుస్తకాల కట్ట దిద్దడానికి తీసుకు వెడుతున్నారు. దారిలో ఒక కొంటె విద్యార్థి ఎదురై "మాష్టారూ! గాడిద బరువు మోసుకు వెడుతున్నారెక్కడికి పాపం?" అని ఎకసక్కెంగా అన్నాడు.

"ఒక గాడిద బరువు కాదురా, 40 గాడిదల బరువు మోస్తున్నానురా!" అని నాయుడుగారు అనేసరికి అది తనకే తగిలేసరికి ఆ విద్యార్థి సిగ్గుపడి తల వంచుకు వెళ్ళిపోయాడు. ఆ కాంపోజిషన్ పుస్తకాలలో అతని పుస్తకం కూడా వుంది!

## "నేను మరణించానండీ!"

ఇది అప్పుడప్పుడు పత్రికలలో జరిగే తమాషా. బ్రతికి వున్న వ్యక్తులు మృతిచెందినట్టుగా పత్రికలలో పొరపాటున పడవచ్చు. అలా పడిన సందర్భాలు కొన్ని వున్నాయి.

రుడ్యార్డ్ కిప్లింగ్ ప్రఖ్యాత ఇంగ్లీషు రచయిత. ఆయన ఇండియాలో జన్మించాడు. తరువాత ఇంగ్లాండ్‌లో వుండిపోయాడు. ఆయనకు ప్రతిష్టాత్మకమైన నోబెల్ సాహిత్య బహుమతి కూడా లభించింది.

ఒకసారి ఆయన మరణించినట్టు ఒక పత్రికలో వార్త పడింది. దాన్ని చూచిన కిప్లింగ్ నిర్ఘాంతపోయి, తరువాత తేరుకుని, ఆ పత్రిక ఎడిటర్‌కు ఒక లేఖ వ్రాశారు :

"మీరు ఏ వార్త అయినా ప్రచురించే ముందు దాని నిజానిజాలను తెలుసుకుంటారు కాబట్టి, తెలుసుకోవాలి కాబట్టి, నా మరణ వార్తను కూడా ఖాయం చేసుకునే, కరెక్టు అనే వేసి వుంటారు. నేను మరణించాను కాబట్టి, మీ పత్రిక చందాదార్ల జాబితానుంచి నా పేరు తీసివేయవలసిందిగాను, మృతునికి మీ పత్రికను ఇక పంపవలదనీ కోరుతున్నాను!"

జరిగిన ఘోర తప్పిదానికి విచారం తెలుపుతూ, కిప్లింగ్‌కు క్షమాపణ చెబుతూ ఆ ఎడిటర్ తరువాత తన పత్రికలో ప్రకటన చేశారనుకోండి! అది వేరే విషయం.



## ఫక్రుద్దీన్ చురక

ఆంధ్ర నాయకుడు వి. వి. గిరిగారి తరువాత ఫక్రుద్దీన్ అలీ అహమ్మద్ మన అయిదవ రాష్ట్రపతిగా ఎన్నికైనారు. అస్సాంకు చెందిన ఆయన అంతకు పూర్వం కేంద్రంలో ఆహార, వ్యవసాయశాఖ మంత్రిగా పని చేశారు. ఆయన బారిష్టర్. ఎదుటివారిపై—వారు తన జోలికివస్తే—నషాళానికి అంటేటట్టు చురకలు వేయడంలో ఘటికుడు. అయితే, ప్రవృత్తిరీత్యా ఆయన మృదు స్వభావి.

ఒకసారి పార్లమెంటు సమావేశం జరుగుతున్నది. ఒక సభ్యుడు లేచి "ఫక్రుద్దీన్‌గారు ఒక 18 ఏళ్ళ అమ్మాయిని వివాహం చేసుకున్నా"రని అకస్మాత్తుగా అభాండాన్ని ప్రేల్చాడు! సభ్యులందరూ నిర్ఘాంతపోయారు. పార్లమెంటులో ఆధారములేనిదే సాధారణంగా ఆరోపణ చేయడానికి వీలులేదు. అందులో కేంద్రమంత్రి పైన—ఆయన ప్రత్యక్షంగా అక్కడే వుండగా! ఇందుకు ఫక్రుద్దీన్ నిశ్చేష్టులౌతారని అందరూ అనుకుంటున్నారు. ఆయన ఏమంటారోనని ఉత్కంఠతో ఎదురు చూస్తున్నారు. అప్పటి ఆయన వయస్సు 50 సంవత్సరాలు.

ఆరోపణ చేసిన సభ్యుడు కూర్చోగానే బారిష్టర్ ఫక్రుద్దీన్ తాపీగా, చిరునవ్వుతో లేచి నిలబడి "గౌరవనీయుడైన సభ్యుడు అన్నది వాస్తవం. నేను నిజంగా 18 సంవత్సరాల అమ్మాయిని వివాహం చేసుకున్నాను. అయితే, అది 20 సంవత్సరాలనాటి మాట!" అని అనగానే సభ్యులందరూ—ఆరోపణ చేసిన సభ్యునితో సహా—హర్షధ్వానాలు చేశారు!

## బెజవాడ బ్లేజ్‌వాడ

కట్టమంచి రామలింగారెడ్డిగారు తెలుగువారిలో గొప్ప మేధావి; పండితుడు. ఆంధ్ర విశ్వవిద్యాలయానికి 1926లో ఆయన మొట్టమొదటి వైస్-చాన్సలర్.

అప్పటిలో విజయవాడను బెజవాడ అని పిలిచేవారు కదా! బెజవాడలో ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటు చేయడం ఆయనకు ఇష్టంలేదు. విశ్వవిద్యాలయాన్ని విశాఖపట్నంలో ఏర్పాటు చేయాలన్నది ఆయన వుద్దేశం.

బెజవాడకు "బ్లేజ్‌వాడ" అని పేరు పెట్టింది ఆయనే. "బ్లేజ్‌వాడ" అంటే

'మండు చెండలవాడ' అని అర్థం. అలాగే బెజవాడను ఆయనే "ఇంటలెక్చుయెల్ సహారా" అన్నారు. అంటే ఇది "మేధావుల ఎడారి" అని అర్థం.

విజయవాడకు కట్టమంచి వారిచ్చిన కితాబులలో రెండవది ఇప్పుడు మాసి పోయింది.

## ముగ్గురు ఆంధ్ర మేధావులు

కట్టమంచి రామలింగారెడ్డిగారిని గురించి, సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారిని గురించి ప్రసిద్ధ ఆంధ్ర నాయకుడు, బహుముఖ ప్రజ్ఞావంతుడు, గాంధేయవాది, చివరికి జ్యోతిష్కుడు కూడా అయిన "ఆంధ్రరత్న" దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారు ఒకసారి ఇలా అన్నారు.

"ఆంధ్రులలో ముగ్గురు మహా మేధావులున్నారు. మొదటివాణ్ణి నేను అయితే, నేను అర్థాయుష్కుణ్ణి. నేను పెద్దగా పైకి రాను. మధ్యలోనే పోతాను. రెండవవారు-కట్టమంచి రామలింగారెడ్డి. ఆయన మహా ప్రతిభాశాలి. అయితే, వాక్‌స్థానంలో ఆయనకు శని వున్నాడు. ఆయన విరోధాలను, విరోధులను కొనితెచ్చు కుంటాడు. అందువల్ల, అత్యున్నత స్థానాన్ని అందుకోలేడు.

"మాలో మూడవవారు-సర్వేపల్లి రాధాకృష్ణన్. ఆయన నవగ్రహమాలికా యోగ జాతకుడు. ఆయన భవిష్యద్భారతంలో మహోన్నత స్థానాన్ని అధిష్ఠిస్తాడు."

"ఆంధ్రరత్న" చెప్పిన మాటలు అక్షరాలా నిజమైనాయి.

ఆయన చెప్పినట్లే, తాను 40 సంవత్సరాలు దాటకుండానే మరణించారు. ఆయన మరణించింది జూన్ 10 వ తేదీన—1928లో; అప్పటికి ఆయన వయస్సు 40 సంవత్సరాల లోపే.

ఆయన అన్నట్లే, కట్టమంచివారు కూడా యూనివర్శిటీల స్థాయి దాటి వెళ్ళ లేదు.

కాగా, స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనకపోయినా, జెయిలుకు వెళ్ళక పోయినా డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్, "అజాత శత్రువు", గాంధీజీ ముఖ్యానుచరుడు, డాక్టర్ రాజేంద్రప్రసాద్ తరువాత ఇండియాకు రెండవ రాష్ట్రపతి అయినారు!



## 'వా'సరుడు ?

వాక్‌స్థానంలో శని వున్నాడన్న కట్టమంచివారు ఒకసారి సర్ అల్లాడి కృష్ణస్వామయ్య సన్మాన సభకు అధ్యక్షుడు.

సర్ అల్లాడి గొప్ప రాజ్యాంగ, న్యాయ శాస్త్రవేత్త. ఆయన అనాకారి. కొంచెం వికృతాకారి.

సాక్షాత్తు, సన్మానితుడైన సర్ అల్లాడిపైనే కట్టమంచివారు హాస్యోక్తి విసిరారు.

"కోతి నుంచి మానవుడు క్రమపరిణామం చెందాడని మానవ పరిణామశాస్త్రవేత్తలు సిద్ధాంతీకరించారు. అంటే కోతి తరువాత, కొన్నిరూపాంతరాలు చెందిన తరువాత చివరిదశగా నేటి మానవాకృతి వచ్చింది. అయితే, కోతికి, మానవునికి మధ్య ఒక ఆకృతి వుండి వుండాలి. ఆ "మిస్సింగ్ లింక్" కోసం శాస్త్రవేత్తలు అన్వేషిస్తున్నారు. ఆ "మిస్సింగ్ లింక్" ఇప్పుడు కనిపించింది—ఎవరో కాదు—ఈ కృష్ణస్వామయ్యగారే!"

కట్టమంచివారి వ్యాఖ్యకు సభ్యులు నవ్వనూలేకపోయారు, నవ్వకుండా వుండనూలేకపోయారు! అలాంటిది కట్టమంచి వాక్పారుష్యం!

## "ప్రతిభకు శిలువ"

డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్, అప్పటి మద్రాసు గవర్నర్ సర్ మహమ్మద్ ఉస్మాన్ ఒకే సభలో మాట్లాడుతున్నారు. రాధాకృష్ణన్ మాట్లాడుతూ-

"సర్ మహమ్మద్ ఉస్మాన్ హైస్కూలులో మొదట నాకంటె సీనియర్; తరువాతి సంవత్సరం ఇద్దరం క్లాసుమేట్సు. ఆ తరువాతి సంవత్సరంలో ఆయన కంటె నేను సీనియర్" అని అన్నారు. సభ్యులు ముసిముసి నవ్వులు నవ్వుకుంటున్నారు. అంటే సర్ ఉస్మాన్ ఒకే క్లాసు రెండుసార్లు తప్పారన్నమాట!

డాక్టర్ సర్వేపల్లి తన ఉపన్యాసం కొనసాగిస్తూ "పెద్దయిన తరువాత నేను కాలేజీ ప్రొఫెసర్‌గా వున్నప్పుడు సర్ ఉస్మాన్ వైస్-ఛాన్సలర్. నేనిప్పుడు వైస్-ఛాన్సలర్‌గా వుంటే, ఆయన గవర్నర్ హోదాలో నాపైన ఛాన్సలర్" అనేసరికి సభికులు తిరిగి ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు!

అంటే చదువులో తనకంటె వెనుకబడిన సర్ ఉస్మాన్ — ఒకే క్లాసు మూడేళ్ళు చదివిన ఉస్మాన్—జీవితంలో పదవుల విషయం వచ్చేసరికి ప్రతిభ లేక పోయినా తనకంటె వున్నత పదవులను అధిష్ఠిస్తున్నారని దీని అర్థం; ప్రతిభకు, పదవికి సంబంధం లేదని దీని తాత్పర్యం.

## తెల్లబోయిన సీజర్!

ఒక్కొక్కప్పుడు మనం అనేమాట మనకే ఎదురు రావచ్చు. గొప్పవారి జీవితాల్లో అలాంటి సంఘటనలు చాలా వున్నాయి.

మనిషిని పోలిన మనిషి వుంటారు. అది ఎంతవరకు వాస్తవమో తెలియదు కాని, ఒకే పోలిక గలవారు ఏడుగురు వుంటారని అంటారు. ఈ పోలికలు ఆధా రంగా కథలు అల్లి, చాలా సినిమాలు తీశారు. ఒకే పోలిక గల ఇద్దరు వ్యక్తుల ఆసక్తికరమైన సంఘటన గురించి తెలుసుకుందాం.

జూలియస్ సీజర్ రోమన్ చక్రవర్తులలో అగ్రగణ్యుడు. ఆయన వంశీకుడే ఆగస్టస్ సీజర్. మన ఆగస్టు నెల ఆయన పేరిటనే ఏర్పడిందంటారు.

అచ్చంగా ఆయన పోలికతో వుండే మరొకవ్యక్తి రోమ్ నగరంలో తిరుగు తున్నాడని ఆ రోమన్ చక్రవర్తి చెవిని ఎవరో వేశారు. అతడిని చూడాలని ఆ చక్ర వర్తి కుతూహలపడ్డాడు.

ఒక రోజున ఆగస్టస్ సీజర్ గుర్రంపై రోమ్ నగర వీధులలో వెడుతున్నాడు. ఆయన పోలికలతో వుండే ఆ డూప్లికేట్ కనిపించాడు. అతడిని వెంటనే దగ్గరకు పిలిచి, "మీ అమ్మగారు నీ పుట్టుకకు పూర్వం రోమ్ నగరంలో వుండేదా?" అని ప్రశ్నించాడు. అంటే ఆ డూప్లికేట్ తన తండ్రికి జన్మించి వుంటాడని ఆగస్టస్ అభిప్రాయం.

ఆ డూప్లికేట్ ఇదేమీ తెలియక "అబ్బే! లేదండీ! మా అమ్మ కాదు, మా నాన్న ఇక్కడ వుండేవాడు!" అనేసరికి ఆ చక్రవర్తి ముఖం వివర్ణమై, వెంటనే అక్కడి నుంచి గుర్రంపై వుడాయించాడు! కథ అడ్డం తిరిగింది కదా!



## ఉర్రుబుర్రుల డాక్టర్

కొందరు డాక్టర్లకు ఓర్పు తక్కువ. రోగులు తెలియక, తమ ఆదుర్దాకొద్దీ, మందులను గురించి, పథ్యం గురించి, జబ్బు ఎప్పుడు తగ్గుతుందని మొదలైన సవాలక్ష ప్రశ్నలు వేస్తూ వుంటారు! ఓర్పు తక్కువైన డాక్టర్లు చిరాకుతో కస్సు బుస్సు మంటుంటారు. అలాంటివారు ఇప్పుడు చాలావరకు తగ్గిపోయారు. వెనుకటి రోజులలో ఎక్కువమంది ఉండేవారు.

ఇది పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ తండ్రి మోతీలాల్ నెహ్రూకు సంబం ధించిన సంఘటన.

మోతీలాల్ నెహ్రూ ఉబ్బసవ్యాధి పీడితుడు. ఇక్కడి డాక్టర్లవల్ల ఆయనకు ఉపశమనం కలగనందున, యూరప్‌లోని వియెన్నాలో ఒక పెద్ద డాక్టరుకు చూపిం చాలని అక్కడికి వెళ్ళారు.

ఆ డాక్టరుకు ఇంగ్లీషు రాదు; మోతీలాల్‌కు జర్మన్ భాష రాదు. అందువల్ల, ఇద్దరి మధ్య రెండు భాషలూ తెలిసిన ఒక అనువాదకురాలున్నది.

"మీకు వచ్చిన బాధ ఏమిటి?" అని డాక్టర్ ప్రశ్నించాడు.

తాను ఉబ్బసం వల్ల పడుతున్న పాత బాధలన్నింటిని తన సహజ సిద్ధమైన పెద్ద గొంతుతో మోతీలాల్‌గారు ఏకరువు పెడుతున్నారు.

డాక్టరుకు చిరాకు వేసింది. అవతల ఇంకా చాలామంది రోగులు నిరీక్షిస్తు న్నారు కూడా.

"ఇంతకీ ఇప్పుడు దేనివల్ల మీరు బాధపడుతున్నారో చెప్పండి!" అని డాక్టరు కొంచెం చిరాగ్గా, కోపంగా అన్నాడు.

వెంటనే మోతీలాల్ "ఇప్పుడు నా డాక్టరు చిరాకువల్ల బాధపడుతున్నాను" అనేసరికి అక్కడ వున్న అనువాదకురాలు ఫక్కున నవ్వింది. ఆ మాటను డాక్ట రుకు అనువదించి చెప్పలేదు; సందేహించింది.

ఇంగ్లీషులో మోతీలాల్ అన్న ఆ మాటకు అర్థం తెలియని డాక్టరు ఆయన ఏమన్నాడో చెప్పమని అనువాదకురాలిని నిగ్గదీశాడు.

"ప్రస్తుతం మీ చిరాకు, కోపాల నుంచే ఆయన బాధపడుతున్నారట! అని ఆమె చెప్పగానే ఆ డాక్టరు కూడా నవ్వి, తన వ్యాధిని గురించి ప్రశాంతంగా చెప్ప వలసిందిగా మోతీలాల్‌ను ఆహ్వానించాడు. మరి, డాక్టరు మాటతోనే రోగి జబ్బు సగం నయం కావాలి. అలాంటి డాక్టర్లు చాలామంది వున్నారు.

## రాజీవ్‌గాంధి హాస్యోక్తి

మన దేశ ప్రధానులందరిలోకి పిన్న వయస్కుడైన రాజీవ్‌గాంధీ హాస్యోక్తు లకు, చలోక్తులకు పెట్టింది పేరు.

అది 1986 నవంబర్. అప్పటిలో ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం తన మంత్రులు, ఇతర ముఖ్య నాయకుల రక్షణకు బుల్లెట్ ప్రూఫ్ జాకెట్లు దిగుమతి చేసుకొనడానికి కేంద్రాన్ని అనుమతి కోరింది.

ఆ విషయాన్ని పార్లమెంటులో లేవదీసిన డి.యం.కె. సభ్యుడు వి. గోపాల స్వామి, "బుల్లెట్ ప్రూఫ్ జాకెట్లతో పాటు, బుల్లెట్ ప్రూఫ్ ప్యాంట్లను కూడా దిగు మతి చేసుకొనడానికి ప్రభుత్వం అనుమతిస్తుందా?" అని అడిగాడు.

వెంటనే హోమ్‌శాఖ సహాయమంత్రి శ్రీ పి. చిదంబరం లేచి, "బుల్లెట్ ప్రూఫ్ జాకెట్లు కావాలి కాని ప్యాంట్లు దేనికి?" అని ఎదురు ప్రశ్న వేశాడు.

వెంటనే ప్రధాని రాజీవ్‌గాంధీ లేచి, "బుల్లెట్ ప్రూఫ్ ప్యాంట్లు కూడా, దిగుమతి చేసుకొనడానికి అనుమతించాలని హోంశాఖ మంత్రిని ఆదేశిస్తాను" అన్నారు.

శ్రీ అటల్ బిహారీ వాజ్‌పేయి లేచి "బుల్లెట్ ప్రూఫ్ జాకెట్లు లేకుండా ప్యాంట్లు దిగుమతి చేసుకుని ఉపయోగమేమిటి?" అని ప్రశ్నించారు.

"దేనికా? గౌరవ సభ్యుని శీలం కాపాడ్డానికి:" అని రాజీవ్‌గాంధీ అనేసరికి రాజ్యసభ చైర్మన్ శ్రీ ఆర్. వెంకట్రామన్‌తో సహా అందరూ గొల్లున నవ్వారు!

పార్లమెంటులో కాని, అసెంబ్లీలో కాని హాస్య స్ఫోరకంగా చలోక్తులు, వ్యంగ్యోక్తులు విసిరే సభ్యులుంటే, సభలో ఉద్రేకాలకు బదులు నవ్వుల పువ్వులు వికసిస్తాయి! ఎమ్.పి.లకు, ఎం.ఎల్. ఏలకు హాస్య రసజ్ఞత అవసరం.



## రాట్నమే కట్నం

స్వార్థం అనేది కలలో కూడా ఎరుగని వ్యక్తి శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి శక్తికొలదీ పనిచేసి, అవసరంకొద్దీ ప్రతిఫలం తీసుకోవాలనే సోషలిస్టు సిద్ధాంతం ఆయనది.

వివాహ సమయంలో మామగారు ఎంత కట్నం కావాలని అడిగితే తనకు ఒక రాట్నం మాత్రమే చాలునన్న అమాయకుడాయన. ఇప్పటి చాలామంది అల్లుళ్ళతో పోల్చితే ఆయన అమాయకుడే కదా!

భోగ విలాసాలన్నా లాల్‌బహదూర్‌కు గిట్టవు. నిరాడంబర జీవనాన్ని ఆయన కోరుకునేవారు. ఒకసారి ఆయన యు.పి. మంత్రి కాగానే ఆయన ఇంటిలో లేని సమయంలో ప్రభుత్వం ఆయన గదికి ఎయిర్ కండిషన్ చేయించింది. చక్కగా ఎయిర్ కండిషన్డ్ గదిలో వుండవచ్చునని ఇంటిలోని వారు సంబరపడు తున్నారు!

సాయంత్రం లాల్‌బహదూర్ ఇంటికి వచ్చి, జరిగింది తెలుసుకుని బాధ పడ్డారు. "నాకు ఈరోజు మంత్రి పదవి వుండవచ్చు, రేపు వూడిపోవచ్చు. అప్పుడు ఎయిర్ కండిషనర్ ఎక్కడ నుంచి వస్తుంది? మనమెప్పుడూ కష్టపడ్డానికే అల వాటుపడాలి. సుఖపడ్డానికి అలవాటుపడితే, తిరిగి కష్టపడలేము" అని లాల్‌బహ దూర్ ఇంటిలోని వారిని మందలించి వెంటనే పబ్లిక్‌వర్క్స్ శాఖ అధికారులకు ఫోన్‌చేసి, ఆ ఎయిర్ కండిషన్ యంత్రాలను తీసివేయించారు.

మంత్రి అయిన దగ్గర నుండి ఎలాంటి భవనం తనకు లభిస్తుందా? ఎంత ఖరీదయిన ఫర్నిచర్ వస్తుందా? అని ఆలోచించే రాజకీయవాదులు, ఉద్యోగరీత్యా తమ నివాసంలో అమర్చిన ఫర్నిచర్ని ఉద్యోగ విరమణ చేస్తూ తమ వెంట పట్టుకు పోయిన ఒక గవర్నర్, ఒక జడ్జి మనకు తెలుసు. అలాంటప్పుడు, లాల్‌బహదూర్ వంటి త్యాగమూర్తులు, నిరాడంబరులు వుంటారంటే నమ్మగలమా?

## "లవ్ లెటర్, లీవ్ లెటర్"

చూడండి! మనం ఒకేరోజు రెండు, మూడు ఉత్తరాలు వ్రాసేటప్పుడు ఎవ రికి వ్రాసిన ఉత్తరాన్ని ఆ అడ్రస్‌ను కవరులో పెట్టకుండా పొరపాటున ఒకరి

ఉత్తరాన్ని మరొకరి అడ్రసు కవరులో పెడితే కొంపలు మునుగుతాయి. ఒక్కొక్కప్పుడు పెద్ద ప్రమాదాలే జరుగుతాయి.

ప్రఖ్యాతి సాహితీకారుడు, చిత్రకారుడు అయిన అడవి బాపిరాజుగారు బందరు నేషనల్ కాలేజీ ప్రిన్సిపాల్‌గా వుండేవారు. ఆ కాలేజీకి ప్రసిద్ధ ఆంధ్ర మహా నాయకులు డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు కార్యదర్శి.

ఒకసారి బాపిరాజు ఏదో సొంత పనిపై వూరు వెడుతూ తనకు మూడు రోజులు సెలవు ఇమ్మని కాలేజీ సెక్రటరీ పట్టాభిగారికి ఒక లేఖ, మూడు రోజుల పాటు వియోగం, విరహం తప్పవని, తలుపులు జాగ్రత్తగా వేసుకు పడుకోమని భార్యకు మరొక ఉత్తరం రాసి, వాటిని పొరపాటున పట్టాభిగారి లేఖను భార్యకు, భార్య ఉత్తరం పట్టాభిగారి కవరులో పెట్టి పోస్టు చేశారు! ఇంకేమున్నది? కొంప మునిగింది.

పట్టాభిగారికి వచ్చిన ఉత్తరంలో "ప్రాణేశ్వరీ! వూరికి వెడుతున్నాను. ఈ మూడు రోజులూ వియోగం, విరహవేదన తప్పవు....వగైరా ప్రేమలేఖలో వుండే పదా(ర్థా)లన్నీ ఉన్నాయి. సాధారణంగా ప్రేయసీ ప్రియుల లేఖలలో వారి పేర్లతో సంబోధన చేయరు. "ప్రియా!" అనో, ఇంకా ఏవేవో ముద్దు పేర్లతోనో సంబోధన ఉంటుంది. చివర కూడా మామూలు పేరుతో సంతకం కాకుండా వేరే ముద్దుపేరే వుంటుంది.

అందువల్ల, ఆ లేఖ ఎక్కడి నుంచి వచ్చిందీ పట్టాభిగారికి మొదట బోధ పడలేదు. ఆ లేఖను "కృష్ణాపత్రిక" ఎడిటర్ ముట్నూరి కృష్ణారావుగారికి, పట్టాభిగారు చూపించే సరికి ఆయన దస్తూరి గుర్తుపట్టి, "ఇది బాపిరాజు ప్రేమలేఖ! మీకెలా వచ్చింది?" అంటే, అప్పుడు ఉభయులకూ అర్థమైంది—"లవ్ లెటర్, లీవ్ లెటర్" తారుమారు అయినాయని! పాపం! పట్టాభిగారికి వ్రాసిన లీవ్ లెటర్ బాపిరాజుగారి భార్యకు చేరి ఉంటుంది—మూడు రోజులపాటు సెలవు ఇమ్మని—అది కూడా అర్థవంతంగానే వుంది కదా! అందుచేత, లేఖలను కవర్లలో పెట్టేటప్పుడు ఎందుకయినా మంచిది! మరొకసారి చూచుకోండి!



# టాగోర్‌నే గుర్తించని స్వరాష్ట్రం

మనలో ఒక పెద్ద దౌర్బల్యం ఉన్నది. మనలోని గొప్పవారిని మనం గుర్తించం: గుర్తించినా, పెద్దవారు గుర్తించిన తర్వాతనే మనం గుర్తిస్తాం. ఇది విశ్వకవి రవీంద్రనాథటాగోర్‌కు సయితం తప్పలేదు.

ఆయనకు ప్రపంచ ప్రఖ్యాతమైన, అత్యంత ప్రతిష్ఠాత్మకమైన నోబెల్ సాహిత్య బహుమతి 1913లో లభించింది. ఆయన "గీతాంజలి" గేయ సంపుటికి ఇది లభించింది.

ఆయనకు నోబెల్ బహుమతి వచ్చిందన్న వార్త వెలువడగానే యావత్ భారతం ఆయనను ఆకాశానికి ఎత్తివేసింది. పత్రికలు ఆయన కవితా వైదుష్యాన్ని ప్రశంసిస్తూ ప్రత్యేక సంచికలు ప్రచురించాయి.

ఒక ప్రత్యేక రైలు వేసుకుని దేశంలోని మేధావులు, కళా, సాహితీ విమర్శకులు, రచయితలు కలకత్తాలో వున్న రవీంద్రుని అభినందించడానికి వెళ్ళారు. వారిని చూడగానే ఆయన ఒకటే అన్నారు.

"మీ అభినందనలు నేను స్వీకరించడం లేదు. "గీతాంజలి"లోని గేయాలన్నీ మొదట బెంగాలీ భాషలో, బెంగాలీ పత్రికలలో ప్రచురించబడ్డాయి. అప్పుడు మీరెవ్వరూ వాటిని మెచ్చుకోలేదు. పైపెచ్చు,వాటిని తీవ్రంగా విమర్శించారు కూడా. వాటి ఇంగ్లీషు అనువాదాన్ని పాశ్చాత్య ప్రపంచం ప్రశంసించి, నోబెల్ బహుమతి ఇస్తే, ఇప్పుడు మీరు మెచ్చుకొనడానికి వచ్చారా? అప్పుడు లేని గొప్పతనం నాలో ఇప్పుడెక్కడినుంచి వచ్చింది? అప్పటి గీతాంజలే ఇప్పటి నోబెల్ గీతాంజలి. నాకు మీ అభినందనలూ వద్దు, సన్మానాలూ వద్దు!" అని టాగోర్ నిష్కర్షగా చెప్పేసరికి ఆ వచ్చినవారు నిర్విణ్ణులైనారు.

అందుకే ఒక కవి "ఏ గతి రచించితేని సమకాలము వారలు మెచ్చరే కదా!" అని వాపోయాడు.

# నాటకాలరాయుడు నాగేశ్వరరావుగారు

ఎంతటి మహనీయులైనా, పెద్దయిన తరువాత ఎంత గొప్పవారయినా, చిన్నప్పుడు వారు కూడా చిన్నవారే; చిన్న బుద్ధులున్నవారే; పిల్లచేష్టలు చేసిన వారే.

ఆయన పెద్దయిన తరువాత ఆంధ్రులకు చిరస్మరణీయుడైన నాయకుడైనాడు. తెలుగువారికి ఎంతోకాలం సేవచేసిన ఒక దినపత్రికకు, ఒక గొప్ప సాహితీ మాసపత్రికకు ఆయన సంస్థాపకుడు.

చిన్నప్పుడు ఆయన బందరులో చదువుకునే రోజుల్లో ఒకరి ఇంట్లో జామపండ్లు దొంగిలించాలని వారి పెరటిలోని జామచెట్టు యెక్కి క్రిందపడ్డాడు. బాగా దెబ్బలు తగిలాయి. తండ్రికి తెలిసి, కొడుకును చావబాది గుంజకు కట్టి వేశాడు!

ఆ బాలుడే పెద్దయిన తరువాత మహాత్మాగాంధిచేత "విశ్వదాత" అని బిరుదు పొందారు; ఆంధ్ర మహాసభనుంచి "దేశోద్ధారక"; ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి "కళాప్రపూర్ణ" బిరుదులు లభించాయి.

ఆయన ఎవరో ఈ సరికి చాలామంది గ్రహించి వుంటారు. ఆయనే కాశీనాథుని నాగేశ్వరరావుగారు! తెలుగు భాషకు, సంస్కృతికి యెంత సేవ చేశారు ఆయన! ఆంధ్రులు ఆయనను ఎన్నటికీ మరువలేరు.

నాగేశ్వరరావుగారు చిన్నప్పుడు మంచినటుడు; నాటకాలంటే చెవికోసుకునేవారు. అయితే, ఆ రోజులలో అందరు తండ్రులవలెనే నాగేశ్వరరావుగారి తండ్రి బుచ్చయ్యగారికి కూడా తన కుమారుడు నాటకాలు వేయడం ఇష్టం వుండేది కాదు. అందువల్ల, కొడుకును ఆయన ఎప్పుడూ కోప్పడుతూవుండేవారు; తండ్రిని చూస్తే నాగేశ్వరరావుగారికి తగని భయం.

అయినా, ఆయన నాటకాలు మాత్రం మానలేదు; అంత పిచ్చి!

ఒకసారి బుచ్చయ్యగారికి జబ్బుచేసింది. అప్పుడు నాగేశ్వరరావుగారు కృష్ణాజిల్లా జగ్గయ్యపేటలో నాటకాలాడుతున్నారు. తండ్రికి జబ్బుగా వుంది, వెంటనే రమ్మని తల్లి కొడుక్కి కబురు పంపించింది. అయితే, ఫలానా నాటకంలో ఒక ముఖ్యమైన పాత్రను నాగేశ్వరరావుగారు ధరిస్తారని ఆ నాటకాల కంపెనీవారు ముందే ప్రకటించడం వల్ల నాగేశ్వరరావు వెళ్ళడానికి వారు అనుమతించలేదు.



ఈలోగా తండ్రి ఆరోగ్య పరిస్థితి విషమించింది. మరణశయ్యపై వున్న తండ్రిని చూడ్డానికి నాగేశ్వరరావుగారు వచ్చారు.

నాటకాలు వేసే వాడి ముఖం చూడనని బుచ్చయ్యగారు కొడుకు ముఖం చూడకుండా తల అటువైపు తిప్పుకున్నారు. కడసారి చూపుకోసం వచ్చిన కొడుకుతో ఒక మాట అయినా మాట్లాడకుండా, అతని ముఖమైనా చూడకుండా ఆ తండ్రి శాశ్వతంగా కన్నుమూశారు!

ఈ సంఘటన నాగేశ్వరరావుగారిని కదిలించి వేసింది. తండ్రిపట్ల, కుటుంబము పట్ల తాను బాధ్యతారహితంగా ప్రవర్తించానని బాధపడి, ఆ తరువాత సమాజ సంక్షేమ బాధ్యతవే తీసుకున్నారు. ఆర్తులకు, అన్నార్తులకు, ఆపదలో వున్నవారికి ఈ చేతిలో ఇచ్చింది. ఆ చేతికి తెలియకుండా దానధర్మాలు చేశారు. తన నిర్లక్ష్యంవల్ల, ఆటకాయితనంగా తిరగడం వల్ల తండ్రిని కోల్పోయానని ఆయనలో కలిగిన ఆర్ద్రత ఆయనను జీవితాంతం దయార్ద్ర హృదయుడుగా మార్చివేసింది! తాను సంపాదించిన లక్షలాది రూపాయలు అవసరంలో వున్న వారందరికి దానధర్మాలు చేసి చివరికి తానే ఋణ బాధలో పడ్డారు! అయితే, తన ఆస్తిపాస్తులు అమ్మి అప్పులు తీర్చారనుకోండి. అంతటి దానశీలి; అంతటి నిజాయితీ పరుడు కాశీనాథుని నాగేశ్వరరావుగారు!

## "నా భార్యను లేవదీసుకు పోతారా?"

అనాటి నాయకులలో హాస్యరసజ్ఞత హెచ్చుగా వుండేది వారిలో కొందరు ఇతరులపై చురకలు వేయడమేకాదు, తనపై ఎవరైనా విసుర్లు విసిరినా హాయిగా నవ్వుకునేవారు.

ఆచార్య జె.బి. కృపలానీ ప్రముఖ గాంధేయవాది. మహాత్మాగాంధికి అనుంగు శిష్యుడు. ఆయన కాంగ్రెసు మహాసంస్థకు 12 సంవత్సరాలుపాటు సెక్రటరీగా పని చేసి "సక్సెస్‌ఫుల్ సెక్రటరీ"గా పేరు తెచ్చుకున్నారు.

1951లో ఆయన కాంగ్రెసును వదిలి పెట్టి ప్రతిపక్షంలో చేరారు. కాంగ్రెసును తీవ్రంగా విమర్శించేవారు. అయితే, ఆయన భార్య సుజాతకృపలానీ మాత్రం

ఆయనతో ఏకీభవించకుండా, కాంగ్రెసులో చేరి, ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రిణి అయ్యారు. అప్పటికి మన దేశంలో ఒక రాష్ట్రానికి ముఖ్యమంత్రి అయిన మొట్ట మొదటి మహిళ ఆమె.

ఒక రోజున ఆచార్య కృపలానీ లోక్‌సభలో ప్రభుత్వ పక్షమైన కాంగ్రెసును తీవ్రంగా విమర్శిస్తున్నారు.

వెంటనే ఒక కాంగ్రెసు సభ్యుడు లేచి, "అయ్యా! కృపలానీగారూ! మీరేమో కాంగ్రెసును విమర్శిస్తున్నారు. మీ భార్యగారేమో మీమాటకాదని మా పార్టీలోచేరి ముఖ్యమంత్రి అయినారు. మీమాట మీ భార్యే వినడంలేదు! మమ్మల్ని ఎలా వినమంటారు?" అని అవహేళనగా అన్నాడు.

ఎదుటి వారికి తడుముకోకుండా సమాధానం చెప్పే కృపలానీ లేచి ఇలా అన్నారు:

"మిత్రమా! ఇంతవరకు కాంగ్రెసువారు వట్టి మూర్ఖులే అనుకున్నాను. ఇప్పుడు ఇతరుల భార్యలను కూడా లేవదీసుకు వెళ్ళే రౌడీలని తెలుసుకున్నాను."

—అని అనేసరికి అన్ని పక్షాల సభ్యులు గొల్లుమన్నారు!

అప్పటిలో విమర్శలు అలా వ్యంగ్యోక్తులతో, హాస్యోక్తులతో వుండేవి!

## ఏది ముందు ఏది వెనుక ?

మన పార్లమెంటులో లోగడ పిలూ మోడీ అనే ప్రతి పక్ష సభ్యుడుండేవారు. ఆయన మహాకాయుడు. విపరీతమైన లావు, పార్లమెంటులో బాగా లావుగా వుండే వారందరు కలిసి ఒక క్లబ్ ఏర్పాటు చేసుకుని, దానికి "భీమ్‌క్లబ్" అని పేరు పెట్టుకున్నారు. దానికి ఈ మోడీ అధ్యక్షుడు.

సాధారణంగా బాగా లావుగా వుండేవారు హాస్యప్రియులు. వారు తమపైన తామే "జోక్స్" వేసుకొనడానికి ఇష్టపడతారు.

ఒకరోజున పీలూమోడీ పార్లమెంటులో తన వెనుక సీటులో కూర్చున్న ఉషా మల్హోత్రాతో వెనక్కి తిరిగి ఏదో వాదానికి దిగారు!



ఇది చూచిన ఏ.జి. కులకర్ణి అనే సభ్యుడు స్పీకర్‌ను ఉద్దేశించి, "అధ్యక్షా! సభ్యుడు మీవైపు తన వీపు తిప్పి ఎవరితోనో మాట్లాడుతున్నాడు. ఇది పార్లమెంటు సంప్రదాయానికి విరుద్ధం; అధ్యక్షునికి అవమానం" అనేసరికి—

వెంటనే పిలూమోడీ స్పీకర్‌వైపు తిరిగి "అధ్యక్షా! నాకు వెనకా ముందూ అంటూ ఏమీ లేవు. నేను గుండ్రంగా వుంటాను ఇక వెనుక ఏది, ముందు ఏది?" అనే సరికి సభ్యులు ఆదేపనిగా నవ్వారు! అది సమయస్ఫూర్తి! హాస్యరసజ్ఞత!

## "నిరాయుధుణ్ణి! నన్ను చంపండి"

అవి స్వాతంత్ర్యోద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజులు. బీహార్‌లోని చాంపరాన్‌లో నీలిమందు తోటల యజమానులు ఆ తోటలలో పనిచేసే కూలీలను ఎన్నో హింసలకు గురిచేస్తున్నారు. కొద్దిపాటి వేతనాలతో వారితో బండ చాకిరీ చేయించుకుంటున్నారు. ఆ యజమానులు ఇంగ్లీషు వారు.

ఆ విషయాన్ని ఆ తరువాత మన ప్రథమ రాష్ట్రపతి అయిన డాక్టర్ రాజేంద్రప్రసాద్ మహాత్మాగాంధీ దృష్టికి తీసుకువచ్చారు.

గాంధీజీ చాంపరాన్ వచ్చి, నీలిమందు తోటలలో పనిచేసే రైతులు, కూలీల చేత తమ హక్కుల కోసం సత్యాగ్రహం చేయిస్తున్నారు.

ఇది నీలి మందు తోటల యజమానులైన తెల్లదొరలకు కంటగింపు అయింది. గాంధీజీ, రాజేంద్రప్రసాద్ నాయకత్వాన జరుగుతున్న ఆ సత్యాగ్రహం కొనసాగితే, యజమానులు రైతుకూలీల కోర్కెలకు అంగీకరించక తప్పదు. అంగీకరిస్తే, వారి లాభాలు తగ్గిపోతాయి. మరి, మహాత్మాగాంధిని హత్య చేయిస్తే, తమ పీడ వదులుతుందనుకున్నారు. ఇందుకు వారు కిరాయి హంతకులను కూడా నియోగించినట్టు బయటికి పొక్కింది. ఇది ఆ నోటా ఆ నోటా పడి, చివరికి రాజేంద్రప్రసాద్ చెవిని పడింది.

"మిమ్మల్ని హత్య చేయించాలని నీలి మందు తోటల యజమానులు కిరాయి హంతకులను ఏర్పాటు చేసుకున్నట్టు రూఢిగా తెలుస్తున్నది. దయచేసి, మీరిక్కడ నుంచి వెళ్ళిపొండి. దేశ స్వాతంత్ర్య సాధనకు మీ ప్రాణాలు అత్యవసరం.

ఈ చిన్న సమస్య మీకు ప్రాణాంతకం కావడం మాకు ఎవ్వరికీ ఇష్టం లేదు" అని రాజేంద్రప్రసాద్ గాంధీజీకి ప్రాధేయపూర్వకంగా విన్నవించుకున్నారు!

ఆ రోజు రాత్రి గాంధీజీ ఒంటరిగా, ఎవ్వరికీ చెప్పకుండా, తనను హత్య చేయించడానికి కుట్ర చేస్తున్నాడన్న తెల్ల యజమాని ఇంటికి వెళ్ళి తలుపు తట్టారు! అతడు వచ్చి, తలుపు తీయగానే తన కళ్లెదుట నిలబడి వున్న వ్యక్తిని— ఎవరినైతే తాను హత్య చేయించదలచుకున్నాడో ఆ గాంధీజీయే నిలబడ్డం చూచి— తెల్ల బోయాడు! నిశ్చేష్టుడైనాడు!

అప్పుడు గాంధీజీ ప్రశాంతంగా "మిత్రమా! మీరు నన్ను హత్య చేయించా లని చూస్తున్నారని తెలిసింది. ఇందుకు మీరు హంతకులను కూడా నియమించినట్టు చెప్పుకుంటున్నారు. నేనిప్పుడు ఒంటరిగా వచ్చాను. నేనిక్కడికి వస్తున్నట్టు ఎవ్వ రికీ తెలియదు కూడా. అందువల్ల, మీరు చంపదలచుకుంటే, నిరాటంకంగా ఆ పని చేయండి!" అనేసరికి ఆ తెల్ల యజమాని విస్తుపోయాడు!

అతడు వెంటనే గాంధీజీకి చేతులెత్తి నమస్కరించి "క్షమించండి! నేను తప్పుదోవ తొక్కాను. మీరు నిజంగా మహాత్ములు" అన్నాడు!

కాగా, స్వాతంత్ర్యోద్యమంలో మహాత్మాగాంధి అనుసరించిన అహింసా సిద్ధాంత సారాంశం ఈ సంఘటనలో ఇమిడి వుంది.

## నర్సును కొట్టిన నెహ్రూ

పండిట్ జవహర్లాల్ నెహ్రూది మహోన్నత వ్యక్తిత్వం. చిన్నప్పటి నుంచి అయన స్వార్థాన్ని, సంకుచితత్వాన్ని వ్యతిరేకించారు; భయ విద్వేషాలను జయిం చారు.

అప్పుడు జవహర్లాల్‌కు 12 సంవత్సరాల వయస్సు. అయన తల్లి స్వరూప రాణినెహ్రూ గర్భవతి. నెహ్రూ నివాసం అలహాబాద్‌లోని ఆనంద భవనంలో ఆమె ప్రసవవేదన పడుతున్నది. ఆ గది వెలుపల జవహర్‌లాల్. ఆయన తండ్రి మోతీలాల్, ఇతర సన్నిహిత బంధువులు కూర్చున్నారు. తిరిగి మగపిల్లాడా? ఆడ పిల్లా? ఏమి కబురు వస్తుందోనని అందరూ ఎదురు చూస్తున్నారు.

ఇంతలో నర్సు జవహర్‌లాల్ దగ్గరకు వచ్చి, "నీకు చెల్లెలే పుట్టింది. ఇంకేం? నీతో ఆస్తి పంచుకోదులే!" అనేసరికి, ఆ సంకుచితమైన భావనకు నెహ్రూకు కోపం వచ్చింది. ఆ నర్సు చెంపమీద పెడేల్మని కొట్టి, "నాకు అలాంటి సంకుచిత భావాలు లేవు. చెల్లెలైనా, తమ్ముడయినా ఒక్కటే, తెలుసా? అన్నాడు!

## నెహ్రూకి చర్చిల్ కితాబు

పెద్దయిన తరువాత కూడా చాలామంది రాజకీయ నాయకులకు వుండే స్వార్థ బుద్ధిని, సంకుచితత్వాన్ని నెహ్రూ ఏవగించుకునేవారు: వాటిని ఆయన జయిం చారు.

అందువల్లనే, భారత స్వాతంత్ర్యోద్యమాన్ని తీవ్రంగా వ్యతిరేకించి, ఆ ఉద్యమ నాయకులైన గాంధీ, నెహ్రూలను అమితంగా ద్వేషించిన బ్రిటిష్ మాజీ ప్రధాని విన్‌స్టన్ చర్చిల్ కెనడాలోని భారతీయ హైకమిషనర్‌తో ఒకసారి ఇలా అన్నాడు.

అసూయా విద్వేషాలు ప్రతి మానవునిలోను ఎంతో కొంత వుంటాయి! మానవ సహజమైన అసూయా ద్వేషాలను, భయాన్ని మీ ప్రధాని నెహ్రూ జయిం చారని నేను అన్నట్టు ఆయనతో చెప్పండి."

నేటి ప్రజాహిత జీవితంలో వున్న వారందరికీ ఈ మాట మననం చేసుకో దగిన మహత్సూక్తి!

## గొత్తెల కాపరి పెంచిన చీఫ్ జస్టిస్

మూఢవిశ్వాసాలు ఎంత దుష్పరిణామాలకైనా దారి తీస్తాయి. మనం పూర్వం కాశీ మజిలీల కథల్లో చదివి వుంటాం. ఒక రాకుమారుడు కానీ, రాకుమార్తెకాని

పుట్టగానే వారివల్ల తల్లి దండ్రులకు కీడు వాటిల్లుతుందని, మరణం తప్పదని ఏ జ్యోతిష్కుడో మిడిమిడి జ్ఞానంతో చెబుతాడు. ఆ దెబ్బతో భయపడిన ఆ తండ్రి-తల్లికి మాతృ ప్రేమ వల్ల ఇష్టం లేకపోయినా—ఆ పసికందును ఏ అడవిలోనో వదిలి పెట్టేయడం జరుగుతుంది!

ఆలాంటి సంఘటన ఇటీవల కూడా నిజంగానే జరిగింది. ఆ బిడ్డ పుట్టగానే తల్లిదండ్రుల పుట్టి మునుగుతుందని జోతిష్కుడు చెప్పిన మాట విని, పుత్ర ప్రేమను కూడా చంపుకుని, ఆ తల్లిదండ్రులు, అతడిని నిర్దాక్షిణ్యంగా ఒక కొండపై వదిలి పెట్టారు.

ఆ బిడ్డను ఒక గొర్రెల కాపరి చూచి, పెంచి పెద్ద చేశాడు; విద్యాబుద్ధులు చెప్పించాడు. అతడు ఆ తరువాత కాశ్మీర్ ప్రధాని అయ్యాడు. ఆయన హయాం లోనే కాశ్మీర్ ఇండియాలో విలీనమైంది. అది 1947 అక్టోబరు నాటిమాట. ఆ తరువాత అతడే మన సుప్రీంకోర్టు జడ్జి అయినాడు: ఆటు పిమ్మట ఆ సర్వోన్నత న్యాయస్థానానికి ప్రధాన న్యాయమూర్తి అయినాడు.

ఆయన పేరు? మెహర్‌చంద్ మహాజన్! ఇది కాశీమజిలీ కథలాగా ఉంది కదూ! కాదు—అక్షరాలా వాస్తవగాథ.

## చేపల బుట్టలో గవాస్కర్!

ఆలాగే ఇండియన్ క్రికెట్‌లో అజరామరమైన కీర్తి ప్రతిష్ఠలు సంపాదించిన సునీల్ గవాస్కర్ పుట్టిన కొన్ని రోజులకే ఎవరి పొరపాటువల్లనో ఒక చేపల బుట్టలో పడ్డాడు. ఇప్పుడే లిటిల్ మాస్టర్! పొట్టి బుడంకాయ. మరి, పురిటి గుడ్డుగా ఎంత ఉంటాడు? అందువల్ల, చేపల బుట్టలోపడ్డ గవాస్కరును ఎవరూ గమనించ లేదు. అతని మేనమామ గుర్తించి తీసుకు వచ్చాడు! అలా జరక్కపోతే, ఇండియన్ క్రికెట్ ఈ "లిటిల్ మాష్టర్"ను, కాదు—గ్రేట్ మాస్టర్‌ను కోల్పోయివుండేదేమో! ఏమో! విధి విలాసం ఎలా ఉండేదో; ఎవరు చెప్పగలరు?



## దెయ్యాలున్నాయా?

మూఢ విశ్వాసాలంటే జ్ఞాపకం వచ్చింది. నవయుగ వైతాళికుడుగా పేరొందిన కందుకూరి వీరేశలింగం గారు తెలుగు సాంఘిక, సాహిత్య రంగాలలో తనకొక విశిష్టమైన ముద్ర వేసుకున్నారు.

క్రిందటి శతాబ్దిలో సంఘసంస్కర్తగా, నవలా రచయితగానే కాక, ప్రముఖ హేతువాదిగా కూడా ఆయన పేరు పొందారు. వితంతువుల పునర్వివాహాలకు ఆయన శ్రీకారం చుట్టారు. మూఢ విశ్వాసాలను తెగనాడారు. భూతప్రేత పిశాచాల నమ్మకాలు భ్రమలని ఆయన స్వయంగా నిరూపించారు.

ఆది రాజమండ్రి పట్టణం. దీర్ఘ వ్యాధితో బాధపడుతున్న ఒక వ్యక్తికి జబ్బు కుదుర్చుతానని ఒక భూతవైద్యుడు నెల రోజులుగా "హ్రాం, హ్రీం" అంటూ హంగామా చేస్తున్నాడు. మంత్రాలెన్ని చదివినా జబ్బు మాత్రం కుదర లేదు.

కాని, నెలరోజులైనాక ఆ భూతవైద్యుడు తన ముడుపు మాత్రం తనకు ముట్టవలసిందేనని హుంకరిస్తున్నాడు. పేదవారయిన ఆ ఇంటివారు జబ్బూ కుదరక, డబ్బూ పోతున్నదని బాధపడుతున్నారు.

ఇంతలో ఆ ప్రక్క ఇంటివారి బక్కపలుచటి అబ్బాయి వచ్చి, సంగతి తెలుసుకుని, "దబ్బివ్వరు, దిక్కున్నచోట చెప్పుకో"మని భూతవైద్యునితో బూకరించాడు. "నిన్ను చేతబడి చేసి, చంపేస్తా"నని భూతవైద్యుడు బుకాయించాడు.

"నీకంటె నాకు పెద్ద మంత్రాలే వచ్చు. మళ్ళీ మాట్లాడావంటే నా శరభ సాళ్వ మంత్రం చదివి నిన్ను ఇక్కడే నెత్తురు కక్కిస్తాననేసరికి ఆ మంత్రం పేరే ఎన్నడూ వినని ఆ భూతవైద్యుడు మంత్ర పఠనం మాని పలాయన మంత్రం పఠించాడు. దానికి మించిన మంత్రం మరిలేదు కదా!

ఆ బక్కపలచటి యువకుడే—కందుకూరి వీరేశలింగంగారు.

పాపం, ఆయన తల్లికి దయ్యాలు, భూతాలంటే విపరీతమైన నమ్మకం. ఆమెకు భూతవైద్యం చేయడానికి వచ్చిన మాంత్రికులను దయ్యాలను చూపించమని ఆయన అడిగేవాడు. ఎవరో శ్మశానంలో భూతాలుంటాయని చెబితే, వీరేశలింగంగారు రాత్రిళ్ళు శ్మశాన వాటికకు వెళ్ళి, అక్కడ దయ్యాలకోసం కాపలా కాసేవాడు.

చివరికి దయ్యాలు భూతాలులేవని, అవి మానవుని మానసిక దౌర్బల్యం నుంచి జనించిన ఊహాజీవులని ఆయన నిర్ధారించారు.

ఒకసారి రాజమండ్రిలో ఆయన ఉంటున్న ఇంటిలో అరటిగెల మువ్వ నుంచి కాక, మధ్యనుంచి బయలుదేరింది. ఇది అరిష్ట సూచకమని, ఆ చెట్టును కొట్టివేయాలని చాలామంది చెప్పగా, వీరేశలింగంగారు వినకుండా అరటిగెలను కొట్టి, కూర వండించి తిన్నాడు. ఆయనకు ఏమీ కాలేదు-హాయిగా ఉన్నారు.

## రామస్వామిచౌదరిగారి హేతువాదం

ఆనాటి తెలుగువారిలో మరొక హేతువాది 'కవిరాజు' త్రిపురనేని రామస్వామి చౌదరిగారు. వీరేశలింగంగారికి, రామస్వామి చౌదరిగారికి కొన్ని పోలికలున్నాయి. ఆయన వలెనే ఈయన కూడా గొప్ప సాహితీవేత్త. సమకాలిక సమాజంలోని చెడుగులపై, మూఢ విశ్వాసాలపై ఇద్దరూ తిరుగుబాటు చేశారు. ఇద్దరూ సంఘ సంస్కర్తలు.

వీరేశలింగంగారి వలెనే రామస్వామి చౌదరిగారు కూడా చిన్నప్పుడే హేతువాద దృష్టితో ఆలోచించడం ప్రారంభించారు. చిన్నప్పుడు ఒక రోజున రామస్వామిగారు ముఖం పుల్ల కోసం వేపచెట్టు ఎక్కుతున్నారట. ఆ వేపచెట్టుకు మేకులు కొట్టి వున్నాయి. కొన్ని వెంట్రుకలు కూడా చుట్టబడి వున్నాయి. కింద ఏవేవో ముగ్గులు, వాటిలో డబ్బులు, ఒక వేప బెత్తం వున్నాయి. తీరని వ్యాధితో బాధపడుతున్న వారికి ఏదో "భూతవైద్యం" చేసి వుంటారు! ఆ ముగ్గులు తొక్కిన వారికి, ఆ డబ్బులు తీసుకున్నవారికి ఆ జబ్బు వస్తుందని నమ్మకం.

చెట్టు ఎక్కుతున్న రామస్వామిగారికి ఈ ఆలోచన ఒక్కక్షణం స్ఫురిం



చింది. కాని, వెంటనే ఆయనలోని హేతువాదం, తిరుగుబాటు తత్వం ఒక్కసారి పెల్లుబికాయి.

చెట్టుకింది వేప బెత్తాన్ని, డబ్బులను తీసుకుని రామస్వామిగారు ఇంటికి వచ్చారు. ఆ జబ్బు ఎలా వస్తుందో చూద్దామని ఆయన కుతూహలం. ఆ వేప బెత్తం చాలాకాలం వరకు ఆయన వద్దనే వుంది. ఆయన క్షేమంగా వున్నారు!

హేతువాదాన్ని మాటలలోనే కాదు, తమ చేతలలో కూడా చూపించినవారు వీరేశలింగంగారు, రామస్వామి చౌదరిగారు!

అందువల్లనే ప్రఖ్యాతకవి, సాహితీ పరిశోధకులు, విమర్శకులు ఆరుద్ర "శతకోటి లింగాలు పోయిననేమి, ఒక్క వీరేశలింగం మిగిలిన చాలు!" అన్నారు!

## "వందమంది కొడుకుల పెట్టు"

ఇప్పుడు చెప్పబోయే సంఘటన శ్రీమతి ఇందిరాగాంధి పుట్టుకకు సంబంధించినది.

ఆమె తాత మోతీలాల్ నెహ్రూకు అతి సన్నిహితుడైన ముస్లిం మిత్రుడు వుండేవాడు. ఆయన పేరు మున్షీ ముబారక్.

ఆయనకు జవహర్‌లాల్ నెహ్రూకు ఒక మగబిడ్డ పుడితే చూడాలని కోర్కె. అప్పటికి జవహర్‌కు ఇంకా సంతానం కలగలేదు.

కొంతకాలానికి ముబారక్‌కు జబ్బు చేసి, మంచంపై వున్నాడు. వచ్చే ప్రాణం, పోయే ప్రాణంగా వుంది. అప్పుడే జవహర్ సతీమణి కమల ఒక బిడ్డను కన్నది. ఆ బిడ్డను మోతీలాల్ తీసుకువెళ్ళి ముబారక్‌కు చూపించాడు.

"అతడు ఆ బిడ్డను జవహర్లాల్ కుమారునిగా భావించి "మోతీలాల్ భాయ్ సాబ్! ఈ మనుమడు నీ పేరు నిలుపుతాడు" అని ఆశీర్వదించాడు.

వెంటనే మోతీలాల్ "మగపిల్లవాడు కాదు, ఆడపిల్ల" అని చెప్పేసరికి "అలాగా! ఆడపిల్ల అయినాసరే, వందమంది కొడుకులకు దీటు అవుతుంది!" అని తిరిగి ఆశీర్వదించి, తరువాత "కోమా"లోకి వెళ్ళిపోయాడు. అంతే! ముబారక్‌ది అదే ఆఖరి మాట! అదే అక్షరాల నిజమైంది. పెద్దదయిన తరువాత ఇందిరాగాంధి

వందమంది పురుష నాయకులకు ధీటుగా నిలిచింది; తాను సాటిలేని నాయకురాలినని నిరూపించుకున్నది.

## పిసినారి నిజాం నవాబు!

ప్రజా సంక్షేమ కార్యక్రమాల కోసం ఎంతటి అవమానాన్ని అయినా భరించిన మహాపురుషులెందరో వున్నారు. అట్టివారిలో కాశీ హిందూ విశ్వవిద్యాలయ వ్యవస్థాపకుడు పండిట్ మదనమోహన మాలవ్యా ఒకరు.

విశ్వకవి రవీంద్రుడు విశ్వభారతి విద్యాసంస్థను స్థాపించి, దానికి విశ్వవ్యాప్తమైన పేరు ప్రతిష్ఠలు తెస్తే, మాలవ్యాజీ నెలకొల్పిన కాశీ విశ్వవిద్యాలయం ఆనాడు జాతీయ స్థాయిలో మహోన్నతమైన కీర్తిప్రతిష్ఠలు సాధించింది. ఎందరో జాతీయ నాయకులు ఆ విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం చేసినవారే.

ఆ మహా విద్యాసంస్థను నెలకొల్పడానికి, నిలపడానికి మాలవ్యా పడని కష్టం లేదు. దేశమంతా పర్యటించి, ఎక్కడ లభిస్తే అక్కడల్లా విరాళాలు సేకరించి ఆ సంస్థను స్థాపించడానికి ఎంత శ్రమించారో, దాన్ని నిలపడానికి అంతే శ్రమించారు. అందువల్లనే మహాత్మాగాంధి మాలవ్యాగారికి "యాచకుల రాజు" అని బిరుదిచ్చారు.

కాశీ విశ్వవిద్యాలయానికి విరాళాలు సేకరించే కార్యక్రమంలో ఒకసారి మాలవ్యాజీ నిజాం నవాబు వద్దకు వెళ్ళారు. నిజాం నవాబు శ్రీ ఉస్మానాలీఖాన్ పరమ పిసినారి అని పేరు. కోట్లాది రూపాయల ఆస్తివున్నా ఆయన అతి నిరాడంబరజీవి. ఎన్ని తరాలకైనా తరగని సంపద వున్నా, ఆయన ఒక కుక్కి మంచంలో తన పెంపుడు మేకపిల్లను పెట్టుకుని పడుకునేవాడు.

తనను విరాళం అడిగిన మాలవ్యాకు నిజాం నవాబు తొంటిచెయ్యి చూపించాడు. హిందూ సంస్థకు తాను ససేమిరా విరాళం ఇవ్వనని స్పష్టం చేశాడు. అయినా, మాలవ్యా నవాబుగారిని అంత తేలిగ్గా వదిలిపెట్టదలచుకోలేదు.

నిజాం నవాబు ప్రతి శుక్రవారం మసీదులో నమాజు చేసి, బయటికి వచ్చి, బిచ్చగాళ్ళకు ధర్మం చేసేవారు. ఇది తెలిసిన మాలవ్యా ఒక శుక్రవారంనాడు నవాబు



నమాజు చేసుకుని బయటికి వచ్చే సమయానికి అక్కడవున్న బిచ్చగాళ్ళ క్యూలో తాను కూడా నిలబడి వున్నాడు.

తీరా మాలవ్యా వద్దకు వచ్చేసరికి నవాబుగారు ఆయనను చూచి ఆశ్చర్యపోయాడు!

"నాకు మీరిచ్చే పైసలను కాశీ విశ్వవిద్యాలయం నిధికి మీ పేరిట జమకడతాను. ఇది ప్రపంచంలోనే అత్యంత ధనికుడైన నిజాం నవాబుగారు కాశీ విశ్వవిద్యాలయానికి ఇచ్చిన భూరి విరాళం అని వ్రాస్తాను" అని మాలవ్యాజీ అనేసరికి నవాబుగారు సిగ్గుపడ్డారు. మాలవ్యాను తనతో తీసుకువెళ్ళి, పెద్ద మొత్తమిచ్చి పంపించారు!

## అమెరికన్ పిసినారి

ఇలాంటి సంఘటనే ఒకటి అమెరికన్ మతాచార్యుడు క్లెమెంట్ హాఫ్‌బాయర్ జీవితంలో కనిపిస్తుంది. ఆయన పేద ప్రజల సంక్షేమం కోసం విరాళాలు సేకరిస్తూ ఒక పిసినారి కోటీశ్వరుని వద్దకు వెళ్ళి, సొమ్ముకోసం చెయ్యి చాచాడు.

వెంటనే ఆ పిసినారి ఒళ్ళు మండి, హాఫ్‌బాయర్ దోసిలిలో ఉమ్మి వేశాడు. అయినా, ఆ క్రైస్తవ మతాచార్యుడు అసహ్యించుకోలేదు, ఆగ్రహపడలేదు, వెనుదిరిగి పోలేదు.

తన చేతిలో ఉమ్మివేసిన ఆ పరమ లోభితో "ఇది నాకిచ్చిన విరాళం. మరి, తిండికోసం అలమటిస్తున్న ఆ పేద ప్రజలకేమిస్తారు?" అనేసరికి అంత పీనాసి మనస్సూ కరిగింది. ఆ మతాచార్యుని ఓరిమికి, పేద ప్రజల సంక్షేమంపట్ల ఆయనకు గల ఆసక్తికి, చిత్తశుద్ధికి అచ్చెరువొంది, ఆయనకు తనకు తోచిన విరాళమిచ్చి, క్షమించమని కోరాడు ఆ పిసినారి!

విరాళాలు సేకరించేవారికి మరీ ఇంతటి పిసినారులు కాకపోయినా, కొన్ని చేదు అనుభవాలు ఎదురు అవుతూ వుంటాయి. అలాంటి వారికి ఓరిమి అవసరమని ఈ రెండు సంఘటనలు తెలియజేస్తాయి.

ఒక చేతితో ఇచ్చింది రెండవ చేతికి తెలియకుండా దానధర్మాలు చేసే కాశీ

నాథుని నాగేశ్వరరావువంటి దయార్ద్ర హృదయులు కొందరైతే, పిల్లికి బిచ్చం పెట్టని పిసినారులు మరికొందరు! ఎందరో మహానుభావులు!

## గాంధి టోపి గవర్నరు!

ఇప్పటి ఆంధ్రులలో చాలామంది మరచిపోయిన ఒక మహాంధ్రుడున్నాడు. ఆయన పూర్వీకులు కృష్ణాజిల్లా పెదమద్దాలికి చెందినవారు. అయితే, ఆయన ఆనాటి మధ్యపరగణాల రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా పని చేశారు. ఆ రాష్ట్రానికి అంతకు పూర్వం హోమ్‌మంత్రి. ఇదంతా స్వాతంత్ర్యానికి పూర్వం మాట. నేటి మధ్య ప్రదేశ్‌లో ఆనాడు చరిత్ర సృష్టించిన ఆ మహాంధ్రుడు ఈడ్పుగంటి రాఘవేంద్ర రావుగారు.

ఆయన తాతగారి హయాంలో ఆ కుటుంబం నేటి మధ్యప్రదేశ్‌కు వెళ్ళి అక్కడ స్థిరపడిపోయింది.

జవహర్లాల్ నెహ్రూ జన్మించిన 1889లోనే పుట్టిన రాఘవేంద్రరావుగారు ఆయన వలెనే లండన్ వెళ్ళి, బారిష్టర్ ప్యాసయి వచ్చారు. నెహ్రూ అలహాబాద్ మునిసిపల్ చెయిర్మన్ చేస్తే, ఈయన మధ్యప్రదేశ్‌లోని బిలాస్‌పూర్ మునిసిపల్ చెయిర్మన్‌గా 12 సంవత్సరాలు పని చేశారు. నెహ్రూవలెనే ఈడ్పుగంటి కూడా తండ్రికి ఒక్కడే కొడుకు.

అవి ఖద్దరు అన్నా, గాంధీ టోపి అన్నా, బ్రిటిష్ ప్రభుత్వం మండిపడే రోజులు. కాని, లండన్ నుంచి రాగానే రాఘవేంద్రరావుగారిపై గాంధీజీ, లోక మాన్య తిలక్‌ల ప్రభావం పడింది. దానితో ఆయన నిత్యం ఖద్దరు దుస్తులనే ధరించ సాగారు.

ఆయన ప్రతిభా విశేషాలు, నీతి నిజాయితీలు చూచిన సహచరులు "బ్రిటిష్ ప్రభుత్వాన్ని వెక్కిరించే ఖద్దరు దుస్తులను వదిలివేస్తే నీకు ఉజ్వల భవిష్యత్తు ఉంటుం"దని సలహా ఇచ్చారు. అందుకు ఆయన అంగీకరించలేదు. పైగా, "ఒక నాటికి ఈ ఖద్దరునే నేను గవర్నర్ భవనానికి తీసుకువెడతా"నని ఆయన మిత్రులకు ప్రత్యుత్తరమిచ్చేవారు.



అలాగే తరువాత రాఘవేంద్రరావుగారు మధ్యపరగణాలకు తాత్కాలిక గవర్నర్‌గా ఉన్నప్పుడు గవర్నర్ అధికార నివాస భవనంలోని సోఫాలకు, తెర లకు ఖద్దరునే వినియోగించారు. తాను కూడా ఖద్దరు దుస్తులను, గాంధీ టోపీని ధరించేవారు.

గవర్నర్ భవనంపై బ్రిటిష్ జెండా. లోపల గవర్నర్‌గారి తలపై గాంధీ టోపీ! గాంధీ టోపీని ధరించడం రాజద్రోహమని, బ్రిటిష్ ప్రభుత్వం భావించే రోజులలో ఆ బ్రిటిష్ ప్రభుత్వం ఆధ్వర్యంలోనే, గాంధీటోపీతోనే ఆయన గవర్నర్ పదవిని నిర్వహించారంటే, ఆయన స్వతంత్ర వ్యక్తిత్వాన్ని, స్వాతంత్ర్యేచ్ఛను, దేశ భక్తిని అర్థం చేసుకోవచ్చు. అందువల్లనే అయనను ఆనాడు "గాంధీ టోపీ గవ ర్నర్" అనేవారు. కాని, ఆయనకు బిరుదుల పట్ల మోజులేదు. "సర్" బిరుదునే ఆయన నిరాకరించారు.

శ్రీ రాఘవేంద్రరావు కొంతకాలం మధ్య పరగణాల అసెంబ్లీలో ప్రతి పక్ష నాయకుడుగా ఉండి, రాష్ట్ర మంత్రివర్గంపై అవిశ్వాస తీర్మానంపెట్టి నెగ్గించారు. మంత్రికి నెలకు రెండు రూపాయలే జీతంగా ఉండాలన్న తీర్మానం పెట్టి, దాన్ని కూడా నెగ్గించారు. ఆయన అంటే ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వానికి హడల్. అయినా, ఆయన ప్రతిభా సామర్థ్యాలను, దేశంలో ఆయనకు గల పేరు ప్రతిష్ఠలను కాదన లేక, ఆయనను వైస్రాయి కార్యవర్గంలో సభ్యునిగా చేసింది. అంటే ఇప్పటి కేంద్ర మంత్రితో సమానం. బహుశా అంతకంటె ఎక్కువే. తరువాత లండన్‌లో ఇండియా వ్యవహారాల మంత్రికి సలహాదారుగా వున్నారు. ఏ పదవిలో ఉన్నా, భారతదేశ ప్రయోజనాలే, ఆంధ్రుల అభ్యున్నతే ఆయన లక్ష్యం

కాగా, ఆంధ్రరాష్ట్రం నిర్మిస్తే మద్రాసు రాష్ట్రంలో రక్తపాతం జరుగు తుందని రాజాజీ ఆనాటి ఇండియా వ్యవహారాలు చూచే బ్రిటిష్ మంత్రికి లేఖ వ్రాశారన్న విషయాన్ని "ఆంధ్ర కేసరి" టంగుటూరి ప్రకాశంగారికి తెలియజేసింది రాఘవేంద్రరావుగారే. తెలుగు వారికి గర్వకారకుడు ఈడ్పుగంటి రాఘవేంద్రరావు గారు.

## ఎయిడ్స్‌ను మించిన వ్యాధి

అసూయ అనేది మానవుడికి "ఎయిడ్స్"ను మించిన కనిపించని భయంకర వ్యాధి. ప్రక్కవాడి, లేదా పొరుగువాడి, లేక తోటివాడి ఉన్నతిని, అదృష్టాన్ని, అభివృద్ధిని చూచి ఓర్వలేని వారెందరో. అసూయాపరులు తమకంటె అభివృద్ధిలో ఉన్న వారిని చూచి మనస్సులో వారిపై ద్వేషం పెంచుకుంటారు. వారిపై వట్టి పుణ్యానికి అభాండాలు వేస్తారు; దుష్ప్రచారం చేస్తారు. కాని, అసూయవల్ల తమకే నష్టమని, తమ ఆరోగ్యానికి భంగమని వారికి తెలియదు.

హెన్రీజేమ్స్ ఇంగ్లీషు నవలా రచయితలలో ప్రముఖుడు పాఠకులలో ఆయన పలుకుబడి, వారిపై ఆయన ప్రభావం, ఆయన పేరు ప్రఖ్యాతులు చాలా మందిలో అసూయ కలిగించాయి. ముఖ్యంగా జేమ్స్ పొరుగున ఉన్న పెద్ద మనిషి ఆయనపై అనవసరంగా ద్వేషాన్ని, అసూయను పెంచుకుని, చీటికి మాటికీ ఆయనతో తగాదా పడి, ఆయనను ఆడిపోసుకునేవాడు. అయినా, జేమ్స్ మాత్రం ఆయన చేష్టలను పట్టించుకునేవాడు కాడు.

ఒకరోజున ఆ పొరుగింటి పెద్దమనిషి భార్యకు ఏదో సుస్తీచేసి; ఆ బాధ భరించలేక, పెద్దగా కేకలు పెడుతున్నది. ఆ పెద్దమనిషి ఏమీ చేయలేక, ఏమి చేయాలో తోచక, తన ఇంటి ముందు పచార్లు చేస్తున్నాడు.

పొరుగింటి గృహిణి కేకలు విన్న జేమ్స్ వారింటికి వెళ్ళాడు. జేమ్స్‌ను చూచిన ఆ పెద్దమనిషి "నువ్వెందుకు వచ్చావ్?" అని కొంచెం చికాగ్గా అన్నాడు.

"ఏమి, రాకూడదా?" అని జేమ్స్ ప్రశ్న.

"అబ్బే! అదికాదు నా ఉద్దేశం" అని, తన తప్పు తెలుసుకున్న ఆ పెద్ద మనిషి జవాబు.

"మరేమీలేదు, మీ ఆవిడ బాధతో పెడుతున్న కేకలు విని, డాక్టరుకు కబురంపించాను. ఆయన వచ్చేసరికి నేను ఇక్కడ ఉండాలి కదా. అందుకే వచ్చాను" అని జేమ్స్ అనేసరికి, ఆ పక్కింటి పెద్దమనిషి ఇంతకాలంగా జేమ్స్ గొప్పతనాన్ని తెలుసుకోలేకపోయినందుకు బాధపడుతూ—

"నేను ఎప్పుడూ నిన్ను ద్వేషించి, ఏన్నో ఇబ్బందులు పెట్టాను. నిన్ను



శత్రువుగానే చూచాను. అందువల్ల, నువ్వు మా ఇంటికి వస్తావని అనుకోలేదులే!" అన్నాడు.

"మిత్రమా! నేను నిన్నెప్పుడూ నా శత్రువుగా చూడలేదు; అనుకోలేదు" అని జేమ్స్ అనేసరికి, ఆపదలో ఆదుకున్న ఆయన మానవీయ దృష్టికి, ఔదార్యానికి ఆ పక్కింటి పెద్దమనిషికి ద్వేషం పోయి, కన్నీళ్ళు తిరిగాయి.

మన మంచితనానికి మన శత్రువు కూడా లొంగిపోతాడు.

## శత్రు నిర్మూలన ఎలా?

అమెరికా అధ్యక్షులలో అగ్రేసరుడు, ఆ దేశంలోని నల్లజాతి వారికి బానిసత్వం నుంచి విమోచనం కల్పించిన అబ్రహాం లింకన్ తన ప్రత్యర్థులను మర్యాదగా, గౌరవంగా చూచేవాడు. ఇది ఆయన మిత్రులకు నచ్చేదికాదు.

ఒకరోజున లింకన్ ప్రాణమిత్రుడొకడు ఆయనతో—

"నీ శత్రువులను మిత్రులుగా చూస్తున్నావు. మరి, వారిని తుదముట్టించేదెప్పుడు?" అని ప్రశ్నించాడు.

"నా శత్రువులను మిత్రులుగా మారుస్తున్నానంటే, నా శత్రువులను నిర్మూలిస్తున్నట్టే కదా!" అని లింకన్ నవ్వుతూ చెప్పిన జవాబు అందరూ అప్పుడూ, ఇప్పుడూ కూడా ఆలోచించదగిందే.

## ఏకైక పుత్రుడు పోయినా...

"కర్మణ్యే వాధి కారస్తే మా ఫలేషు కదాచన" అని భగవద్గీతలో శ్రీకృష్ణుడు ప్రవచించాడు. అంటే "నీ విధిని నువ్వు నిర్వర్తించు. ఫలితం గురించి ఆలోచించబోకు; దాన్ని నాకు వదిలిపెట్టు" అని తాత్పర్యం. అలాగే కష్టసుఖాలను సమానంగా పరిగణించేవాడే స్థితప్రజ్ఞుడని గీత ప్రవచిస్తున్నది. కాని, అలా వ్యవహరించగలవారెందరు?

మహర్షి బులుసు సాంబమూర్తి ఆంధ్రనాయకులలో ప్రముఖుడు. ఆయన స్వాతంత్ర్యోద్యమంలో ఎంతో త్యాగం చేశారు. పోలీసులు ఆయనను క్రింద పడ వేసి నోటిలో మలమూత్రాలు పోశారు!

కాగా, 1923లో కాకినాడలో అఖిల భారత కాంగ్రెస్‌మహాసభ జరుగుతున్నది. ఆ మహాసభ ఆహ్వాన సంఘానికి శ్రీ సాంబమూర్తి కార్యదర్శి. యావద్భారతం నుంచి వచ్చే ప్రతినిధులకు మూడురోజులపాటు భోజన వసతి సౌకర్యాలు, మహాసభ ఏర్పాట్లు చూడవలసిన బాధ్యత ఆయనది. ఆ ఏర్పాట్లన్నింటిని సాంబమూర్తిగారు చురుకుగా చేస్తున్నారు.

దురదృష్టవశాత్తు, మహాసభ మరి 10, 12 రోజులున్నదనగా, సాంబమూర్తి గారి ఏకైక పుత్రుడు టైఫాయిడ్‌తో మృతిచెందాడు!

గంపెడు పుత్రశోకం! అవతల పుట్టెడు బాధ్యత!

సాంబమూర్తిగారు మనోనిబ్బరం కోల్పోకుండా ఒక ప్రక్క కన్నీరు తుడుచుకుంటూనే మరొకవంక ఆ మహాసభ మహాభారాన్ని మోసి, ఆంధ్ర భోజనం రుచిని ఉత్తరాది మహా నాయకులకు చూపించి, వారి మెప్పు పొందారు. ఆయన ఆధ్వర్యాన జరిగిన సభలలో ఒకటిగా పేరొందింది!

సాంబమూర్తిగారి పుత్రశోకాన్ని, అయినా ఆయన కర్తవ్య పరాయణత్వాన్ని వివరిస్తూ "ఇండియన్ నైటింగేల్" సరోజినీనాయుడు ఆశువుగా అప్పటికప్పుడు ఆలపించిన విషాదగీతిక సభికులను కదిలించి, కన్నీరు తెప్పించింది!

అంతటి స్థితప్రజ్ఞను అలవరచుకొనడం అందరికీ సులభసాధ్యం కాదు.

## బూట్‌పాలిష్ చేసే వైస్ చాన్సలర్

కొన్ని విషయాలు మనం చెప్పడం కంటె ఆచరించి చూపిస్తే దాని ప్రభావం ఇతరులపై, ముఖ్యంగా విద్యార్థులపై త్వరగా పడుతుంది.



డాక్టర్ రాజేంద్రప్రసాద్, డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్‌ల తరువాత డాక్టర్ జాకీర్ హుస్సేన్ మన మూడవ రాష్ట్రపతి. ఆయన ప్రఖ్యాత విద్యావేత్త. గాంధీజీ బేసిక్ విద్యా విధానాన్ని రూపొందించింది ఆయనే.

ఆయన ఢిల్లీలో స్వయంగా జామియా మిలియా విశ్వవిద్యాలయాన్ని స్థాపించాడు. దానికి ఆయన కొంతకాలం వైస్-ఛాన్సలర్‌గా వున్నారు. యూనివర్సిటీ విద్యార్థులు పరిశుభ్రమైన దుస్తులతో రావడంలేదని, దుమ్ము కొట్టుకున్న, పాలిష్ చేయని బూట్లతో వస్తున్నారని, ఆ పద్ధతులు మానుకోవాలని ఆ యూనివర్శిటీ వైస్-ఛాన్సలర్‌గా డాక్టర్ జాకీర్ హుస్సేన్ యెన్నిసార్లు ఆయా క్లాసులకు సర్క్యులర్‌లు పంపించినా, విద్యార్థులు మాత్రం యథాప్రకారంగానే "నీట్"గా రావడంలేదు.

ఇలా కాదని, ఒకరోజున డాక్టర్ జాకీర్ హుస్సేన్ యూనివర్శిటీ గేటు ముందు నిలబడి వున్నారు. అది విద్యార్థులు యూనివర్శిటీకి వచ్చే సమయం. తమను మందలించడానికి వైస్-ఛాన్సలర్ గేటు ముందు నిలబడి వున్నారని విద్యార్థులు అనుకుంటున్నారు.

వారిలో ముందు వచ్చిన విద్యార్థిని చూచి "బాబూ! నీ బూట్లు మాసి, దుమ్ము కొట్టుకుని వున్నాయి. నీ కాలు ఇలా ఇవ్వు. బూటు పాలిష్ చేస్తాను!" అని చేతిలో బూట్ పాలిష్, బ్రష్‌తో వున్న జాకీర్ హుస్సేన్ అనేసరికి ఆ విద్యార్థి, అతని వెనుక వున్న విద్యార్థులు ఒక్కసారిగా సిగ్గుపడి దిగ్భ్రాంతి చెందారు. అలాంటి సన్నివేశాన్ని వారు వూహించలేదు.

వెంటనే వారు వైస్-ఛాన్సలర్‌గారికి క్షమాపణ చెప్పుకుని ఇకనుంచి దుమ్ము బూట్లతో క్లాసుకు రామని, క్రమశిక్షణ గల విద్యార్థులుగా వుంటామని శపథం చేశారు.

డాక్టర్ జాకీర్ హుస్సేన్ మహాత్మాగాంధి అనుంగు శిష్యుడు. ఆ విద్యార్థులను మార్చడానికి, వారిలో క్రమశిక్షణ పాదుకొల్పడానికి ఆయన అనుసరించింది గాంధేయ విధానమే కాదా?

## మీరెవరి చెప్పులు తుడుస్తారు?

బూట్ పాలిష్ అంటే జ్ఞాపకం వచ్చింది. ఒకసారి అబ్రహాం లింకన్ తన బూట్లు తానే పాలిష్ చేసుకుంటున్నాడు. ఆ సమయంలో ఒక మిత్రుడు అక్కడికి వచ్చాడు.

"అదేమిటి అబ్రహాం! నీ బూట్లు నువ్వే పాలిష్ చేసుకుంటున్నావ్!" అన్నాడు.

వెంటనే అబ్రహాం "మరి నువ్వెవరి బూట్లు పాలిష్ చేస్తావ్?" అని అనేసరికి ఆ మిత్రుడు దానిలోని చురకను గ్రహించి చిన్నబుచ్చుకున్నాడు!

ఆ తరువాత అమెరికా అధ్యక్షుడుగా కూడా అబ్రహాం లింకన్ నిరాడంబరత్వానికి పేరెన్నికగన్నాడు! అంతటి మహోన్నత వ్యక్తి అబ్రహాం లింకన్!

## అపర కుంభకర్ణుడు కామరాజ్

జులై 15వ తేదీ కామరాజ్ జన్మదినోత్సవం. ఆయన అసలు పేరు కామరాజ్ నాడార్. అయితే నాడార్ అన్నది కులం పేరు కాబట్టి, నాడార్‌ను తొలగించి, ఆయన కామరాజ్‌గా మిగిలారు.

ఆయనకు చిన్నప్పుడే తండ్రి పోవడంవల్ల మేనమామ వద్ద పెరిగి, అయిదవ తరగతి వరకు మాత్రమే చదివారు. తరువాత తమిళనాడులోని విరుధ్‌నగర్‌లో కొబ్బరికాయల కొట్టులో గుమాస్తాగా పని చేశారు.

అప్పుడే గాంధీజీ పిలుపుపై అయన స్వాతంత్ర్యోద్యమంలో చేరారు. ఆదే సమయంలో ఒకసారి పండిట్ నెహ్రూ మద్రాసు వచ్చారు. ప్రముఖ తమిళ నాయకుడు సత్యమూర్తి ఇంటో నెహ్రూ బస. సత్యమూర్తి శిష్యుడైన కామరాజ్ ఆ రాత్రి నెహ్రూకు తోడుగా అయన గదిలో పడుకున్నారు.

కామరాజ్ నిద్ర కుంభకర్ణుడి నిద్ర. నిద్రలో ఆయన భయంకరమైన శబ్దంతో గురక పెట్టేవాడు.

కామరాజ్ కుంభకర్ణుడి గురకతో నెహ్రూకు నిద్ర పట్టలేదు. ఆయన



వెంటనే సత్యమూర్తిని పిలిచి "ఈ కుంభకర్ణుణ్ణి నా గదిలోనుంచి గెంటివేయండి" అని అన్నారు. అప్పటికి కామరాజ్ కేవలం ఒక కాంగ్రెసు వలంటీరు మాత్రమే.

అయితే, తరువాత కామరాజ్ చదువుకోనకపోయినా స్వయం కృషితో లోకజ్ఞానంతో, నీతినిజాయితీలతో కాంగ్రెస్‌లో గొప్ప నాయకుడైనారు మద్రాసు ముఖ్యమంత్రి అయినారు. అప్పటి మద్రాసు రాష్ట్ర రాజకీయాలలో "కింగ్ మేకర్"గా పేరు తెచ్చుకున్నారు ఆయన మద్దతు పొందినవారే మద్రాసు ముఖ్యమంత్రి.

పది సంవత్సరాలపాటు పదవులలో వున్న కాంగ్రెస్ నాయకులు పదవులను పరిత్యజించి, పార్టీ సేవ చేయాలని ఆయన సూచించారు ఆదే కామరాజ్ పథకంగా పేరు పొందింది.

పది సంవత్సరాలపాటు సమర్థంగా, నీతి నిజాయితీలతో మద్రాసు ముఖ్యమంత్రిత్వాన్ని నిర్వహించిన కామరాజ్‌ను—ఒకప్పుడు అపర కుంభకర్ణుడని తన గది నుంచి గెంటివేసిన ఆ సామాన్య వలంటీరునే—కాంగ్రెసు అధ్యక్ష పదవి స్వీకరించవలసిందిగా 1963 చివరిలో పండిట్ నెహ్రూ అహ్వానించారు!

ఆ పదవిలో వుండగానేరెండుసార్లు దేశ ప్రధాని పదవికి నెహ్రూ, లాల్ బహదూర్‌ల మృతి కారణంగా ఖాళీ ఏర్పడినప్పుడు కామరాజ్ తన రాజకీయ చాణక్యంతో నెహ్రూ తరువాత లాల్‌బహదూర్‌ను, ఆయన అనంతరం ఇందిరాగాంధీని ప్రధానులను చేశారు. అందువల్లనే అయన మొట్టమొదటి "కింగ్ మేకర్"గా మన దేశంలో పేరుపొందారు. రెండవ "కింగ్ మేకర్"గా ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు పేరుపొందారు.

కాగా, కామరాజ్ అందరు రాజకీయవేత్తలవలె వెనుకా ముందూ ఆలోచించకుండా వాగ్దానాలు చేసేవాడు కాడు. ఎవరు ఏది అడిగినా, "పార్కలాం"—అంటే "చూద్దాం"—అనేవారు. అచి తూచి మాట్లాడడాన్ని ఆయన నుంచి చాలామంది నేర్చుకోవలసి వుంటుంది.

ఆయన అనవసరమైన వాగ్దానాలు చేయకుండా, చేసిన వాగ్దానాన్ని తప్పని సరిగా నెరవేర్చేవారు.

"నెరవేర్చలేని వాగ్దానాలు చేయకండి. అవి మీ మెడకు పాములవలె చుట్టుకుంటాయి" అని ఒకసారి అయన తన మంత్రులను హెచ్చరించారు.

అందువల్లనే, ఒకప్పటి సోవియట్ యూనియన్ అధినేత కృశ్చేవ్ "రాజకీయ వేత్తలు నదిలేని చోట ఆనకట్ట కడతామని వాగ్దానం చేస్తారని" విమర్శించారు!

కాగా, సామాన్యుడైనా, అసామాన్యుడై మాన్యుడు కావచ్చుననడానికి కామరాజ్ జీవితమే తార్కాణం!

## బ్రిటిష్ పోలీసులకు సింహస్వప్నం

"స్వాతంత్ర్యం నా జన్మహక్కు. దాన్ని నేను సాధించి తీరుతాను" అని లోక మాన్య బాలగంగాధర్ తిలక్ స్వాతంత్రోద్యమ సమయంలో గర్జించిన విషయం తెలిసిందే. ఆ గర్జనకు ఎందరో యువకులు ప్రతిధ్వనించారు. భారతమాత దాస్య శృంఖలాల విచ్ఛేదనకు తమ అమూల్యమైన ప్రాణాలనే బలి పెట్టారు.

అట్టివారిలో చంద్రశేఖర్ అజాద్ ఒకరు. "అజాద్" అంటే స్వాతంత్ర్యమని అర్థం.

మధ్యప్రదేశ్‌కు చెందిన చంద్రశేఖర్‌కు **14, 15** సంవత్సరాల ప్రాయంలో, నూనూగు మీసాలనాడే భారతమాత పిలుపు వినిపించింది. స్వాతంత్ర్యోద్యమంలో చేరాడు.

ఒకరోజు విద్యార్థులందరు కలిసి జాతీయ జెండాను చేబూని నినాదాలు చేస్తూ ఊరేగింపుగా వెడుతున్నారు.

పోలీసులు చంద్రశేఖర్‌ను అరెస్టు చేసి, మేజిస్ట్రేటు ముందు విచారణకు ప్రవేశ పెట్టారు.

"నీ పేరు?" అని మేజిస్ట్రేటు ప్రశ్నించాడు.

"ఆజాద్" అని చంద్రశేఖర్ గంభీరమైన సమాధానం.

"నీ తండ్రి పేరు?"

"స్వేచ్ఛ!" తిరిగి అజాద్ జవాబు.

"నీ నివాసం?"

"జైలు" అని చంద్రశేఖర్ అనేసరికి న్యాయమూర్తికి ఒళ్ళు మండింది.



ఆ బాలుడు జగమొండి లాగున్నాడనుకుని, మేజిస్ట్రేటు అతనికి **15** కొరడా దెబ్బలు విధించాడు.

జైలు ముందు బహిరంగ ప్రదేశంలో ఒక పోలీసు చంద్రశేఖర్‌ను కొరడాతో కొడుతున్నాడు.

ఏ ఆచ్ఛాదనాలేని చంద్రశేఖర్ వీపుపై కొరడా పెట్టి చెళ్లుమని కొడుతుంటే చంద్రశేఖర్ ఆజాద్ అమ్మా అని కూడా అనకుండా, బాధ కూడా కనిపించకుండా ఒక్కొక్క దెబ్బకు "వందేమాతరం", "మహాత్మా గాంధీకి జై" అంటూ బిగ్గరగా, ఆ పరిసరాలే ప్రతిధ్వనించేటట్టు నినాదాలు చేస్తున్నాడు.

ద్రౌపది వలువలు వలవబూనిన దుశ్శాసనుని చేతులవలె ఆ పోలీసు చేతులు కొట్టలేక చచ్చుపడ్డాయి కాని, బాల చంద్రశేఖర్ చెక్కుచెదరలేదు ఆ దృశ్యం చూసి జనం కన్నీరు కార్చారు కాని, ఆయన కళ్ళు మాత్రం చెమర్చలేదు! అదీ ఆ విప్లవవీరుల స్వాతంత్ర్యేచ్ఛ! దేశభక్తి!

ఆ తరువాత చంద్రశేఖర అజాద్ విప్లవవీరులు, అమర జీవులు, భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌లతో కలిసి హిందుస్తాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ అన్న పేరుతో విప్లవ దళాన్ని ఏర్పాటుచేసి, బ్రిటిష్ ప్రభుత్వంపై హింసాయుత పోరాటం జరిపాడు.

"పంజాబ్ కేసరి" లాలాలజ్‌పతిరాయ్‌పై క్రూరంగా, పాశవికంగా లాఠీ చార్జి చేసి, ఆయన మృతికి కారకుడయిన శాండర్స్ అనే బ్రిటిష్ పోలీసాఫీసరు లాహోరులో మోటారు సైకిలుపై వెడుతుండగా, ఈ విప్లవకారులు అతడిని కాల్చి చంపారు.

శాండర్స్ హత్య కేసులో నిందితుడయిన చంద్రశేఖర అజాద్‌ను అరెస్టు చేయడానికి బ్రిటిష్ పోలీసులు విశ్వప్రయత్నం చేస్తున్నారు. బొందిలో ప్రాణాలతో మాత్రం పోలీసులకు చిక్కనని చంద్రశేఖర్ ప్రతిజ్ఞ పూనాడు.

ఒకరోజున చంద్రశేఖర్ అజాద్ అలహాబాద్‌లోని ఆల్‌ఫ్రెడ్ పార్కులో ఉండగా, ఒక స్వాతంత్ర్య ద్రోహి ఈ సమాచారాన్ని పోలీసులకు అందించాడు.

వెంటనే పోలీసులు పెద్ద సంఖ్యలో ఆ అలహాబాద్ పార్కును ముట్టడించి, మామూలు పౌరులందరిని ఖాళీ చేయవలసిందిగా హెచ్చరించారు.

చంద్రశేఖర్ అజాద్ అప్పటికి దాదాపు 25 సంవత్సరాల యువకుడు బలిష్ఠమైన కాయం, ఆజానుబాహువు అయిన చంద్రశేఖర్ మెలితిరిగిన మీసాలతో పహిల్వాన్ వలె పోలీసులకు చూడటానికే భీకరంగా కనిపించేవాడు.

పార్కులో ఆయన ఒక్కడే మిగిలాడు. పార్కులోని పొదల మాటున దాగి, బ్రిటిష్ పోలీసులు ఆయనపై విచ్చలవిడిగా తుపాకులతో కాలుస్తున్నారు. తన వద్ద ఉన్న రివాల్వరుతో అజాద్ కూడా కొందరు పోలీసులను కూల్చివేశాడు.

తుపాకి గుళ్ళతో ఆయన శరీరం తూట్లు పడిపోయింది. రక్తం చిమ్ముతున్నది. చివరికి "వందేమాతరం" అంటూ అరుస్తూనే ఆ మహా దేశభక్తుడు కన్నుమూశాడు.

అయితే, ఆ మహావీరుని దగ్గరకు వెళ్ళడానికి ఆ బ్రిటిష్ పోలీసులకు గుండెలు చాలలేదు అయన ఇంకా బ్రతికివున్నాడేమో! లేచి తమను కాల్చివేస్తాడేమోనని వారి గుండెలు పీచుపీచు మంటున్నాయి.

అజాద్ మృతదేహంపై నలువేపుల నుండి తుపాకిగుండ్ల వర్షం కురిపిస్తూ పోలీసులు గుండెలు చేతబట్టుకుని అయన శరీరాన్ని సమీపించారు.

తుపాకిగుళ్ళ తూట్లతో జల్లెడవలె వున్న ఆయన శరీరాన్ని చూచి ఆయన మరణించాడని పోలీసులు ఊపిరి పీల్చుకున్నారు. అలా ఎందరో దేశభక్తులు నూనూగు మీసాలనాడే దేశం కోసం ఆత్మార్పణ చేశారు.

## కొరడా దెబ్బలు పెట్టిన ఇంటి పేరు

కొరడా దెబ్బలనగానే తెలుగునాట జరిగిన మరొక మరపురాని సంఘటన జ్ఞాపకం వస్తున్నది.

నిజాం నిరంకుశత్వాన్ని ఎదుర్కొనడానికి తెలంగాణా ప్రాంతంలోని దేశ



భక్తులు ఎందరో లాఠీదెబ్బలకు గురైనారు. తుపాకిగుళ్ళకు బలైనారు. ఎన్నో రుధిరాశ్రువులు కురిపించారు.

అట్టివారిలో "వందేమాతరం" రామచంద్రరావుగారు ఒకరు. ఆనాటి నిజాం ప్రాంతానికి చెందిన ఆయనకు ఆ పోరాటంలో పాల్గొన్నందుకు 21 కొరడా దెబ్బల శిక్షపడింది.

ఆయన కూడా కొరడాదెబ్బలు కొడుతుంటే, కిమ్మనకుండా, భయపడకుండా బాధపడకుండా దెబ్బ దెబ్బకూ "వందేమాతరం" అంటూ గర్జించారు! అందువల్లనే, చివరికి "వందేమాతరం" అయన ఇంటిపేరు అయింది. ఆయన పూర్తి పేరు వావిలాల రామచంద్రరావు. వావిలాల ఆయన ఇంటిపేరు. "వందేమాతరం" కొరడా దెబ్బలు పెట్టిన ఇంటిపేరు!

## వందేమాతరం

మన్యం విప్లవవీరుడు అల్లూరి సీతారామరాజు మాత్రం! ఏమి ధైర్య సాహసాలు! ఏమి త్యాగనిరతి!

బ్రిటిష్ సైనికాధికారి తనపై తుపాకిగుండ్లు కాలుస్తుంటే, ఆ సమయంలో నిరాయుధుడయిన ఆ మహావీరుడు ఒక్కొక్క తుపాకీగుండుకు "వందేమాతరం" అన్న సినాదంతోనే వీరోచితమైన సమాధానమిచ్చి నేలకొరిగాడు. మనదేశంలో అసంఖ్యాకులయిన దేశభక్తులతో పాటు కొందరు దేశద్రోహులు కూడా ఉంటూ వచ్చారు. అల్లూరి సీతారామరాజు ఆచూకీని బ్రిటిష్ సైనికాధికారి రూధర్‌ఫర్డ్‌కు ఒక స్వాతంత్ర్య ద్రోహి అందివ్వకపోతే, ఆ విప్లవ యోధుని పట్టుకొనడం బ్రిటిష్ తాబేదారులకు సాధ్యమయ్యేనా?

## విషమిచ్చే భార్య - త్రాగే భర్త

ఇంతవరకు చెప్పుకున్నవి స్వాతంత్ర్య యోధుల గాథలు. ఇప్పుడొక చిన్న హాస్యోక్తి.

బ్రిటిష్ మాజీ ప్రధాని విన్‌స్టన్ చర్చిల్ ఈ శతాబ్దిలో బ్రిటిష్ ప్రధానులైన వారందరిలో ఉద్దండుడు. నోబెల్ బహుమతి పొందిన సాహితీవేత్త. ఎంత గంభీరంగా కనిపించేవాడో, అంతటి హాస్యప్రియుడు. కన్సర్వేటివ్‌లలో తీవ్రవాది.

బ్రిటిష్ కామన్సు సభకు ఎన్నికైన మొట్టమొదటి మహిళ నాన్సీయాష్టర్ ఒకసారి చర్చిల్‌లోని కరడుకట్టిన కన్సర్వేటివిజాన్ని చూచి ఒళ్ళుమండి "నేనే కనక నీ భార్యనయితే కాఫీలో విషం కలిపి ఇచ్చేదాన్ని" అన్నది.

"మహాతల్లీ! నువ్వేకనక నా భార్యవైతే ఆ విషపు కాఫీని మారు మాటాడకుండా త్రాగేవాణ్ణి!" అనేసరికి తన గయ్యాళితనానికి ఆయన వేసిన ఎదురు చురకకు ఆమె నివ్వెరపోయింది! అంత గయ్యాళిగంప భార్యతో వేగడంకంటె విషం త్రాగడమే మంచిదని చర్చిల్‌గారి తాత్పర్యం! అంతేకదా!

## టీచరుపై తిలక్ తిరుగుబాటు

జులై 23వ తేదీ "లోకమాన్య" బాలగంగాధరతిలక్ జన్మదినోత్సవం. తిలక్ మహారాజ్ మన స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో మరపురాని—మరువలేని—పేరు.

ఆయన మహాత్మాగాంధీకే గురుతుల్యుడు. తిలక్ మరణిస్తూ తన తరువాత గాంధీజీయే స్వాతంత్ర్యోద్యమ నాయకుడని ప్రకటించారు. ఆయన మరణానంతరం గాంధీజీ భారత స్వాతంత్ర్యోద్యమ సర్వసేనాని అయినారు.

"స్వాతంత్ర్యం నా జన్మహక్కు; దాన్ని నేను సాధించి తీరుతా"నని బ్రిటిష్ ప్రభుత్వంపై స్వాతంత్ర్య సమర శంఖారావం పూరించిన ఆయనకు అన్యాయాన్ని ఎదిరించడమనేది ఉగ్గుపాలతో పెట్టిన విద్య.

చిన్నప్పుడు తిలక్ పాఠశాలలో చదువుతుండగా ఒక ఆసక్తికరమైన సంఘటన జరిగింది. క్లాసురూమ్‌లో ఎవరో పిల్లలు కాగితాలు చించి, చిందర వందరగా పోశారు.

ఇది ఉపాధ్యాయుడు చూచి, ఉగ్రుడైనాడు. అలా చేసింది ఎవరని అడిగితే, ఎవ్వరూ సమాధాన మివ్వలేదు. ఎందువల్లనంటే, ఆ పని చేసింది ఒక రౌడీ కుర్ర



వాడు. అతని పేరు చెబితే తరువాత తమకు మూడుతుందని భయపడిన విద్యార్థులు కిమ్మనకుండా ఊరుకున్నారు. ఉపాధ్యాయునికి మరింత ఆగ్రహం వచ్చి, ఆ కాగితాలన్నింటిని బయట పారవేసి, గదిని శుభ్రం చేయవలసిందిగా విద్యార్థులకు ఆజ్ఞాపించాడు. పిల్లలందరూ గడగడలాడుతూ గదిని శుభ్రం చేస్తున్నారు. కాని, ఒక్క కుర్రవాడు మాత్రం పూడ్చడం లేదు.

"నీవెందుకు గదిని శుభ్రం చేయడంలే"దని ఉపాధ్యాయుడు ఆ కుర్రవాడిని గద్దించాడు.

"నేను కాగితాలు చించలేదు. చించింది ఎవరో కూడా నాకు తెలియదు. అలాంటప్పుడు, చేయని తప్పుకు నేనెందుకు శిక్ష అనుభవించాలి? ఎవరో తప్పు చేశారని అందరినీ దండించడం అన్యాయం కాదా?" అని తిలక్ నదురూ, బెదురూ లేకుండా సమాధానమిచ్చాడు. ఆ జవాబు మాస్టారుకు నచ్చలేదు. బెత్తం తీసుకుని తిలక్‌ను చితక బాదాడు. వళ్ళు వాచేటట్టు దెబ్బలెన్నన్నా తిన్నాడు కాని, ఆ బాలుడు గది పూడ్చడానికి మాత్రం ససేమిరా అంగీకరించలేదు.

ఈ సంగతి తిలక్ తండ్రి రామచంద్ర తిలక్‌కు తెలిసింది. తన కుమారుని న్యాయదృష్టికి, స్వతంత్ర ప్రవృత్తికి, నిర్భీకత్వానికి ఆయన ఎంతో సంతోషించాడు. ఒకనాటికి ఆ కుర్రవాడే పెద్దయిన తరువాత మహానాయకుడై రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యవాద ప్రభుత్వాన్ని ఎదిరించి లోకమాన్యుడవుతాడని ఆ తండ్రి ఆనాడు వూహించగలిగితే ఇంకెంత సంతోషించి వుండేవాడో!

## డాబా దూకిన తిలక్

తిలక్ సాహసికుడు. కాలేజీలో చదువుతున్నప్పుడు విద్యార్థులందరూ ఒక సాయంత్రం హాస్టలు డాబాపై కూర్చుని బాతాఖానీ కొడుతున్నారు. "ఇప్పుడు హఠాత్తుగా ఈ హాస్టలుకు నిప్పంటుకుంటే తప్పించుకునే మార్గమేమిటి?" అని ఒక విద్యార్థికి ధర్మ సందేహం కలిగింది. విద్యార్థులందరూ తలొకమార్గం ఏకరువు పెడుతున్నారు.

తిలక్ లేచి, "అవేమీ కాదు—ఇలా తప్పించుకోవాలి" అంటూ డాబాపై

నుంచి క్రిందకు దూకేశాడు. విద్యార్థులందరు దిగ్భ్రాంతి చెంది తిలక్ ఏమైపోయాడోనని కిందకు దిగి వస్తుంటే, చెక్కు చెదరని తిలక్ మెట్లపై ఎక్కిరావడము చూచి విద్యార్థులు ఆశ్చర్యపోయారు !

తిలక్ పెద్దయిన తరువాత మహా పండితుడు, గొప్పవక్త, పత్రికా సంపాదకుడు, ఖగోళ శాస్త్రవేత్త, భగవద్గీతకు వ్యాఖ్యాత—అన్నింటిని మించి, ఆదర్శ మహానాయకుడు!

## నెహ్రూను విరోధించిన దుర్గాబాయి

ఆంధ్ర మహానాయకురాంధ్రలో దుర్గాబాయి దేశ్‌ముఖ్ చిరస్మరణీయురాలు. రాజమండ్రిలో అతిసామాన్య కుటుంబంలో జన్మించి, చిన్నప్పుడు చదువుకోలేక, తరువాత ప్రయివేటుగా హిందీ చదివి, మహాత్మాగాంధి ఆంధ్ర పర్యటనలో చిన్ననాడే ఆయన హిందీ ఉపన్యాసాలను తెలుగులోకి అనువదించి, ప్లీడరై, సుప్రీం కోర్టు లాయరై, చివరికి అప్పటి కేంద్ర ఆర్థిక మంత్రి చింతామణ్ దేశ్‌ముఖ్‌ను వివాహమాడి ఆంధ్ర మహిళాసభ వ్యవస్థాపకురాలై, ఎన్నో విద్యా, వైద్య సంస్థలను స్థాపించి తాను స్థాపించిన సేవా సంస్థలే తన స్మారక చిహ్నాలుగా మిగిల్చి వెళ్ళిపోయిన విదుషీమణి, మహిళామణి గుమ్మిడిదల దుర్గాబాయమ్మ.

1923లో కాకినాడలో కాంగ్రెసు మహాసభ జరుగుతుంటే, ఆమెను ఆహ్వాన సంఘంవారు ప్రధాన ప్రవేశ ద్వారం వద్ద వలంటీరుగా నియమించి, రెండణాల టిక్కెట్టు చూపించిన వారినే లోనికి పంపించవలసిందిగా ఆదేశించారు.

ఎర్రగా, అందంగా వున్న ఒక యువకుడు లోపలికి వెళ్ళబోతుండగా దుర్గాబాయి ఆయనను ఆపి, "టిక్కెట్టు ఏదీ?" అని అడిగింది. అప్పటికి ఆమె వయస్సు 14 సంవత్సరాలు.

టిక్కెట్టు కొనలేదని ఆయన చెప్పి, "నాపేరు జవహర్లాల్!" అని పేర్కొన్నాడు. "మీరు ఏ లాల్ అయినా సరే, టిక్కెట్టుకు రెండణాలు చెల్లించి కాని లోపలికి వెళ్ళడం కుదర"దని దుర్గాబాయి తెగవేసి చెబుతుండగా, నెహ్రూ చిరునవ్వుతో ఏమీ చేయలేక చూస్తున్నాడు.



ఇంతలో ఆహ్వాన సంఘాధ్యక్షుడు "దేశభక్త" కొండ వెంకటప్పయ్యగారు వచ్చి, నెహ్రూను లోపలికి పంపించి, దుర్గాబాయిని మందలించేసరికి ఆమె ఆగ్రహావేశాలతో "మీరే కదా టిక్కెట్టు లేనివారు, ఎంత గొప్పవారయినా లోనికి పంపించవద్దని చెప్పారు. అలాంటప్పుడు, మీ మాటను మీరే ఉల్లంఘిస్తే ఎలా?" అని నిలదీసేసరికి ఆయన మారుమాటాడలేకపోయారు.

దుర్గాబాయి తరువాత కూడా జీవితంలో అంత నిర్మొహమాటంగా, నిక్కచ్చిగా వుండేవారు. కుండ బ్రద్దలు కొట్టినట్టు మాట్లాడేవారు. ఆమెను చూస్తే ఆనాటి ఆంధ్ర నాయకులు చాలామందికి కొంచెం భయంగానే వుండేది. ఆమె ఆకారం కూడా ఎర్రని జీరలతో పెద్ద కళ్ళు, గండు ముఖంతో—ఆరుద్రగారన్నట్టు, "దుర్గాబాయీ భీకరానన"గానే వుండేది. అన్నట్టు, ఆమె ఒకసారి లోక్‌సభ డిప్యూటీ స్పీకర్‌గా కూడా ఉన్నారు. పట్టుదల, నిర్భీతి, ధైర్యసాహసాలు, క్రమశిక్షణ, నిర్మాణ కార్యనిర్వహణ దక్షతలలో ఆమె మహిళాలోకానికి ఆదర్శప్రాయురాలు. అన్నట్టు, కామరాజ్‌వలె ఆమె జన్మదినం కూడా జులై 15వ తేదీ!

## హేమా హేమీల చురకలు

జులై 26వ తేదీ—ప్రపంచ ప్రఖ్యాత బ్రిటిష్ నాటకకర్త, సాహితీ విమర్శకుడు జార్జి బెర్నార్డ్‌షా జన్మదినోత్సవం.

ప్రపంచ ప్రఖ్యాతమైన ఆయన హాస్యోక్తులు, వ్యంగ్యోక్తులు యెన్నో వున్నాయి. కాగా, ఇద్దరి గొప్పవారి మధ్య పరస్పర వ్యవహార శైలికూడా విచిత్రంగా వుంటుంది. వాస్తవం చెప్పవలసివస్తే, చాలామంది ప్రముఖులిద్దరి మధ్య పైకి సయోధ్య కనిపించినా లోలోపల పరస్పర అసూయా ద్వేషాలు, ఒకరికంటె ఒకరు ఎక్కువన్న ఆధిక్యతా మనస్తత్వం కానవస్తాయి.

ఒకసారి జార్జి బెర్నార్డ్‌షా తాను వ్రాసిన కొత్త నాటకం మొదటి ప్రదర్శనకు రావలసిందిగా కోరుతూ ప్రఖ్యాత బ్రిటిష్ రాజనీతిజ్ఞుడు విన్‌స్టన్ చర్చిల్‌కు రెండు ఆహ్వానాలు పంపుతూ "ఇందులో ఒకటి మీకు, రెండవది మీకు స్నేహితుడంటూ ఎవరైనా వుంటే అతడికి!" అంటూ వాటితో ఒక లేఖ కూడా వ్రాశాడు.

అంటే చర్చిల్‌కు యెవ్వరూ స్నేహితులు లేరని, ఆయన అంత ఏకాకి అని దీని భావం.

చర్చిల్ సామాన్యుడా? దెబ్బ వేయడంలో బెర్నార్డ్‌షా కంటె ఆయన నాలుగాకులు ఎక్కువే చదివాడు.

చర్చిల్ ఆనాడు ఆహ్వానాలను "షా"కు తిప్పి పంపుతూ "ఈరోజు నేను మీ నాటకానికి రాలేను. నాకు తీరిక లేదు. మీ నాటకం రెండవసారి ప్రదర్శించడ మంటూ జరిగితే అప్పుడు రెండు ఆహ్వానాలు పంపండి; వస్తాను" అని లేఖ వ్రాశాడు!

అంటే అది చెత్త నాటకమని, రెండవసారి ప్రదర్శనకు నోచుకోదని చర్చిల్ చురక! దెబ్బకు దెబ్బ సరిపోయింది కదూ? చర్చిల్ చురక నషాళం అంటుతుంది. బెర్నార్డ్‌షా చురక నవ్వుల పువ్వులు విరియిస్తుంది.

## నా అందం, నీ తెలివి కలిస్తే?

ఒకసారి ఒక అమెరికన్ అందాల నటి బెర్నార్డ్‌షాకు తారసపడింది. ఆమె అతి తెలివిపోయి—

"షా" గారూ! మీరు మహామేధావంతులు; నేను అతిలోకసుందరిని మన ఇద్దరము పెళ్ళిచేసుకుంటే; మీ తెలివి, నా అందం కలబోసిన కొడుకు పుడతాడుకదా!" అన్నది.

వెంటనే "మరి నా అందం, నీ తెలివితో కొడుకు పుడితే?" అన్నాడు.

"షా" అందగాడు కాడు. సన్నగా, పొడుగ్గా ఎండిపోయినట్టుండేవాడు. సాధారణంగా బరిష్‌వారే అంత! ఇక, సినీ తార అందానికే కాని, మేధా శక్తికి పేరు పొందింది కాదు కదా!

## చెప్పులు చంకలో పెట్టుకున్న శరత్‌బాబు

గొప్పవారి పద్ధతులు, అలవాట్లు, ఆలోచనలు విచిత్రంగానే వుంటాయి.



రవీంద్రనాథ్ టాగోర్ విశ్వవిఖ్యాత రవీంద్రుడైతే, శరత్‌బాబు ప్రఖ్యాత బెంగాలీ నవలా రచయిత. శరత్‌బాబు రచించిన "దేవదాసు" నవల, ఆ సినిమా తెలుగు నాటనే కాదు, యావద్భారతంలోను పేరు పొందాయి.

ఒకసారి రవీంద్రుడు తన సాహితీ మిత్రులతో కవితా చర్చ చేస్తున్నారు. అక్కడికి చేతిలో ఒక పొట్లంతో శరత్‌బాబు వచ్చారు.

"మీ చేతిలో ఆ పొట్లం ఏమిటండీ?" అని ఆయనను ఒకరు అడిగారు. జవాబు చెప్పడానికి శరత్‌బాబు సందేహిస్తున్నారు—అందులో ఏమున్నదో కాని!

ఇంతలో రవీంద్రుడు అందుకుని—"పాదుకా పురాణం కదూ, శరత్!" అని చిరునవ్వుతో అన్నారు. ఔనన్నట్టుగా శరత్ తల వూపారు. అయితే అదేమిటో అక్కడివారి కెవ్వరికీ అర్థం కాలేదు. అదేదో మహాకావ్యమని అందరూ అనుకుంటున్నారు.

అప్పుడు అందరికీ ఆసక్తి కలిగే రీతిగా రవీంద్రుడు "ఆ పొట్లంలో మరేమీ లేదు— ఆయన చెప్పులు తప్ప!" అనే సరికి అందరూ ఆశ్చర్యపడ్డారు; నవ్వుతున్నారు.

అప్పుడు రవీంద్రుడే ఆ పొడుపు కథ విప్పారు. శరత్‌బాబు పాదరక్షలను అంతకు పూర్వం ఎవరో కొట్టి వేశారు....రెండు, మూడుసార్లు అప్పటి నుంచి ఆయన ఎక్కడికి వెళ్ళినా, లోపలికి వెళ్ళేముందు తన చెప్పుల జత విప్పి కాగితంలో పొట్లం కట్టుకుని, తన ప్రక్కనే జాగ్రత్తగా పెట్టుకునే వారు.

ఈ ప్రహసనంలో మొదటి భాగం మనలో చాలామందికి జరుగుతూనే వుంటుంది, కాకపోతే, రెండవ భాగాన్ని మాత్రం మనం పాటించము !

## గంగా మాతకు హస్తార్పణం

అది 1857 నాటి ప్రథమ భారత స్వాతంత్ర్య సమరం జరుగుతున్న సమయము. ఝాన్సీలక్ష్మిబాయి, నానాసాహెబ్, తాంతియా తోపె, రాణా కున్వర్‌సింగ్ మొదలైన స్వాతంత్ర్యయోధులు బ్రిటిష్ ప్రభుత్వాన్ని మనదేశం నుంచి తరిమివేయ దానికి దానితో సాయుధ పోరాటం జరుపుతున్నారు.

వారిలో "బీహార్ కేసరి"గా బిరుదు పొందిన జగదీశ్‌పూర్‌రాజా కున్వర్‌సింగ్ మహాయోధుడు, అరివీర భయంకరుడు.

ఆ స్వాతంత్ర్య సమరంలో ఒకరోజు రాత్రి తనను తరుముకు వస్తున్న బ్రహ్మాండమైన బ్రిటిష్ సేనలనుంచి తప్పించుకొనడానికి తన సైనికులతో కున్వర్ సింగ్ ఒక పడవలో గంగా నదిని దాటుతున్నాడు. బ్రిటిష్ సైనికులు ఆయన పడవపై తుపాకి గుళ్ళ వర్షం కురిపించారు. ఒక గుండు వచ్చి, ఆయన కుడిచేతి మణి కట్టును తాకి, తీవ్రంగా గాయ పరిచింది.

గంగానది ఆవలి ఒడ్డుకు చేరిన కున్వర్‌సింగ్ విపరీతంగా నొప్పి పెడుతున్న తన కుడిచేతిని ఖండించి పారవేయవలసిందిగా తన సైనికులను కోరితే ఎవరు అంగీకరిస్తారు?

అప్పుడు ఆ యోధాగ్రణి తన గుర్రం కళ్లాన్ని నోటితో పట్టుకుని ఎడమ చేతితో కుడిచేతిని మోచేతి వరకు ఖండించి, "గంగామాతా! ఇది నీ పుత్రుడు నీకు అర్పించే బలిదానం. ఇకనైనా మాకు స్వాతంత్ర్య ప్రదానం చెయ్యి తల్లీ!" అంటూ ఆ ఖండిత హస్తాన్ని ఆ నదీ ప్రవాహంలో విసిరి వేశాడు. ఆ సాహసానికి, ఆ అఖండమైన మనో నిబ్బరానికి భారతీయులు, బ్రిటిష్ సైనికులు కూడా అచ్చెరువు పొందారు.

ఆయనను తుదముట్టించడానికి బ్రిటిష్ ప్రభుత్వం జనరల్ లీగ్రాంట్ నాయకత్వాన పెద్ద సేనను పంపింది. ఎడమచేతితోనే స్వయంగా యుద్ధం చేస్తున్న కున్వర్‌సింగ్ నాయకత్వంలోని విప్లవసేన బ్రిటిష్ సైన్యాన్ని ఓడించింది. జనరల్ లీగ్రాంట్‌ను కున్వర్‌సింగ్ హతమార్చాడు.

కున్వర్ సింగ్ తిరిగి జగదీశ్‌పూర్‌కు రాజుగా పట్టాభిషిక్తుడైనాడు.

అయితే, ఆయన చేతి పుండు మానలేదు. ఔను, మరి, 80 సంవత్సరాల వయస్సులో సగం చేతిని అర్ధరాత్రివేళ నరికి, గంగానదికి సమర్పిస్తే, వాతం కమ్మకుండా వుంటుందా? పైగా చికిత్స చేయించుకొనడానికి కూడా వ్యవధి లేకుండా తిరిగి యుద్ధమాయె!

ఆ పుండుతోనే "బీహార్ కేసరి" స్వాతంత్ర్యయోధుడు కున్వర్‌సింగ్ 1858 ఏప్రిల్ 24వ తేదీన కాలధర్మం చెందాడు!



అలా ఎందరు వీరులు, వీరాంగనలు ఆత్మబలిదానం చేస్తే, మనం అనుభవిస్తున్న ఈ స్వాతంత్ర్యం లభించింది!

'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ!"

## "మర్యాదలో నేనే నంబర్ I"

కొందరికి చిన్న పదవో, ఉద్యోగమో వస్తే చాలు, అధికారదర్పంతో మిడిసి పడతారు. పెద్ద మనసున్నవారు, ఎంత పెద్ద పదవి వచ్చినా, ఏ హోదా వచ్చినా, ఎంత ఎదిగినా ఒదిగే వుంటారు.

ఒకసారి అమెరికా అధ్యక్షుడు అబ్రహాంలింకన్ ఒక స్నేహితుడితో కలిసి గుర్రపు బగ్గీపై వెడుతున్నాడు. దారిలో ఓ నీగ్రో ఎదురు పడ్డాడు. అతడి బట్టలు మాసిపోయి వున్నాయి; టోపీ చినిగి పోయింది; మనిషే దుమ్ముకొట్టుకుని వున్నాడు.

దేశాధ్యక్షుని చూడగానే ఆ నీగ్రో తన టోపీతీసి శాల్యూట్ చేశాడు. వెంటనే అబ్రహాంలింకన్ గుర్రపు బగ్గీలో లేచి నిలబడి, తన టోపీ తీసి ఆ నీగ్రోకు ప్రత్యభివాదం చేశాడు.

ఇది చూచిన ఆయన మిత్రుడు "అదేమిటి, అబ్రహాం! ఆ ముసలి నీగ్రోకు లేచి నిలబడి టోపీ తీసి మరీ శాల్యూట్ చేశావ్? అతనెక్కడ? నీ వెక్కడ? నీవు ఈ మహా దేశానికి ప్రెసిడెంట్‌వి. అతడు నికృష్టపు నీగ్రోవాడు!" అనగానే అబ్రహాం లింకన్ "మిత్రమా! మర్యాదలో నాకంటె ఎవ్వరూ అధికంగా వుండరాదన్నది నా వుద్దేశం. ఆ నీగ్రో అభివాదానికి నేను ప్రత్యభివాదం చేయకపోతే, నాకంటె అతడే మర్యాదస్తుడు, సంస్కారవంతుడవుతాడు. ఒక దేశాధ్యక్షుని కంటె ఒక సామాన్య పౌరుడు సంస్కారవంతుడనిపించుకుంటే, అది ఆ అధ్యక్షునికి ఏమి గౌరవం? ఆ దేశానికి ఏమి గౌరవం?" అనే సరికి ఆ మిత్రుడు తన దేశాధ్యక్షుని నిరాడంబరత్వానికి, సౌజన్యానికి అబ్బురపడ్డాడు!

అలాంటి మర్యాద మన్ననలు మన పరిపాలకులలో ఎందరి కున్నాయి?

## ఆస్ట్రేలియాలో గాంధీగారి "మేక"

మనం బ్రిటిష్ వారి పరిపాలనలో వున్నప్పుడు మనలో కొందరు బ్రిటన్ వెళ్ళినా, ఇక్కడ వున్న ఇంగ్లీషు వారయినా భారతీయులను చులకనగా చూచేవారు; వీలు దొరికినప్పుడల్లా భారతీయులను వెక్కిరించేవారు.

అప్పటిలో విదేశాలలో ఆడే అంతర్జాతీయ క్రికెట్ మ్యాచ్‌లలో భారతీయ క్రికెట్ ఆటగాళ్ళకు అవకాశం లభించేది కాదు. మనది అప్పటిలో బ్రిటిష్ వలస

అయితే, అప్పటిలో ప్రముఖ భారతీయ క్రికెట్ క్రీడాకారుడు పటౌడీ నవాబ్ సీనియర్‌కు ఆస్ట్రేలియాలో జరుగుతున్న క్రికెట్ మ్యాచ్‌లో ఇంగ్లీషు టీములో ఆడే అవకాశం లభించింది. అది 1932వ సంవత్సరం.

సిడ్నీ గ్రౌండ్‌లో క్రికెట్ మ్యాచ్ ప్రారంభమైంది. ఇంగ్లీషు టీము కెప్టెన్ గ్రౌండ్‌లోకి రాగానే ఇంగ్లీషువారు, ఆస్ట్రేలియన్లు తెల్లవారే కాబట్టి, ఆయనను చూచి హర్షధ్వానాలు చేశారు.

కొంతసేపు తరువాత పటౌడీ వచ్చి, బ్యాటింగ్ చేస్తున్నాడు; ఆయన నెమ్మదిగా పరుగులు చేస్తున్నాడు.

అప్పటిలో గాంధీగారు కేవలం మేకపాలు త్రాగి జీవిస్తున్నారని దేశ విదేశాలలో అందరికీ తెలుసు. పాశ్చాత్యులు కొందరికి అది హేళనగా వుండేది.

గాంధీగారి దేశంనుంచి వచ్చిన పటౌడీని ఆటలు పట్టిద్దామని ఒక ఆస్ట్రేలియన్ అనుకున్నాడు. సాధారణంగా క్రికెట్ మ్యాచ్ జరిగేటప్పుడు కేకలు, నినాదాలు, అరుపులు సహజమే.

ఆ ఆస్ట్రేలియన్ "హే గాంధీ! నీ మేక ఎక్కడ?" అని మేక గొంతుతో అరిచాడు. ప్రేక్షకులందరూ ఒక్కసారి దిగ్భ్రాంతి చెందారు. అతడు అలా ఎందుకు అరవవలసి వచ్చిందో వారికి అర్థం కాలేదు.

అయితే, పటౌడీ బెంబేలు పడలేదు. వెంటనే "ఓ నా మేకా! నువ్విక్కడ వున్నావా?" అంటూ ఆ కేక వినిపించిన వైపు తన వ్రేలు చూపుతూ "అయ్యా!



ఇక్కడ ఎవరైనా నాకొక తాడు ఇస్తారా? నా మేకను కట్టి తోలుకు పోతాను!" అని అరిచేసరికి అంతమంది ప్రేక్షకులూ గొల్లున నవ్వారు! ఆ మానవరూపంలో వున్న మేక అక్కడినుంచి నెమ్మదిగా వుడాయించింది!

## దొరసానమ్మకు చౌదరిగారి ప్రశ్న !

అప్పుడు కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి ఇంగ్లాండులో బారిష్టరు చదువుతున్నారు. ఆయన ఇంగ్లాండులో సూటు, హ్యాటు ధరించకుండా పంచె, తలపాగా ధరించేవారు. ఒకరోజున ఒక తెల్ల దొరసాని ఆయనతో "ఏమండీ! మీరు ఇంగ్లాండులో వున్నప్పుడు సూటు, బూటు, హ్యాటు ధరించాలి, కాని ఈ నాటు వేషమేమిటి?" అని హేళనగా అన్నది.

ఆయన వెంటనే "దొరసానమ్మా! ఇది నా జాతీయ డ్రస్సు. మరి నువ్వు ఇండియా వస్తే, ఈ గౌను వదిలేసి, చీరె, రవిక కట్టుకుంటావా?" అంటే ఆమె నవ్వి వూరుకుంది. అప్పటిలో భారతీయులను పాశ్చాత్యులు ఏమన్నా అంటే, మన దేశభక్తులు తమకు వచ్చే సమస్యలను, ఇబ్బందులను కూడా లెక్కచేయకుండా బుద్ధి చెప్పేవారు —నోటితో, అవసరమైతే చేతితో కూడా!

నేతాజీ సుభాస్‌చంద్రబోసు తాను చదువుకుంటున్న కటక్‌లోని రావెన్‌షా కాలేజీ ప్రిన్సిపాల్ భారతీయులను గురించి చులకనగా మాట్లాడాడని ఆ కాలేజీ విద్యార్థుల చేత ఏకంగా సమ్మె చేయించారు!

## వీర సావర్కార్ వీరోచిత చర్య

"దేశభక్తులలో సుభాస్ చంద్రబోసు ఉత్తముడని నా నమ్మకం" అని గాంధీజీ ఒకసారి అన్నారు. అది అక్షరాల వాస్తవమే. కాగా, దేశభక్తిలో సుభాస్ చంద్రబోసుతో పోల్చదగు మరొక మహనీయుడున్నాడు. ఆయన పేరే వినాయక్ సావర్కార్. అకుంఠితమైనది ఆయన దేశభక్తి. మన మాతృభూమిని విదేశీయ పాలన నుంచి విముక్తి చేయాలన్న పోరాటంలో ఆయన చురుకుగా పాల్గొన్నాడు. ఆయనను పట్టుకోవాలని బ్రిటిష్ ప్రభుత్వం తీవ్రంగా ప్రయత్నిస్తుండగా, ఆయన లండన్

వెళ్ళారు. అక్కడ బ్రిటిష్ ప్రభుత్వం ఆయనను అరెస్టు చేసి, విచారణకై ఇండియా తీసుకు వస్తున్నది.

ఆయనను తీసుకువస్తున్న స్టీమర్ ఫ్రాన్స్ తీరాన్ని సమీపించినప్పుడు ఆయన కాలకృత్యం కోసమని పోలీసు కాపలా మధ్య ఆ స్టీమర్‌లోని మరుగుగొడ్డిలోకి వెళ్ళారు. దానిలోని రంధ్రం గుండా ఆయన సముద్రంలోకి దూకి ఫ్రెంచి తీరానికి ఈదుకుంటూ వెడుతున్నారు!

ఈలోగా పోలీసులు ఆయన ఇంకా మరుగుదొడ్డిలోనే వున్నాడనుకుంటున్నారు. అయితే. ఈదుకుంటూ వెడుతున్న వ్యక్తిని చూచి, అనుమానించి, వారు మరుగుదొడ్డిలోకి తొంగి చూచేసరికి ఏడీ, వీరసావర్కార్! ఫ్రెంచి తీరం చేరుకున్నాడు.

వెంటనే పోలీసులు కూడా ఒడ్డుకు చేరుకుని, సావర్కార్‌ను వెంటాడారు. ఆయన వారినుంచి తప్పించుకుని, ఒక ఫ్రెంచి పోలీసును కలుసుకుని, తనను ఒక మేజిస్ట్రేటు వద్దకు తీసుకు వెళ్ళమని కోరాడు. ఈలోగా బ్రిటిష్ పోలీసులు వచ్చి ఆ ఫ్రెంచి పోలీసులకు లంచమిచ్చి, సావర్కార్‌ను స్వాధీనం చేసుకున్నారు.

ఒక నిందితుడు విదేశీ భూభాగంపై వున్నప్పుడు అతడిని ఆ దేశం అనుమతి లేకుండా అరెస్టు చేయడానికి వీలులేదు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు విలువనిచ్చే ఫ్రాన్స్‌లో తనకు ఆశ్రయం లభించగలదని సావర్కార్ భావించారు.

అయితే. అప్పటిలో దేశంలోని పరిస్థితులవల్ల దుర్బల స్థితిలో వున్న ఫ్రెంచి ప్రభుత్వం ఆ అవమానాన్ని కిమ్మనకుండా భరించింది.

అంతటి దేశభక్తుని బ్రిటిష్ ప్రభుత్వం విచారించి, రాజద్రోహ నేరారోపణపై యావజ్జీవ కారాగారవాస శిక్ష విధించి, అండమాన్ దీవులకు పంపించింది.

అండమాన్ దీవులంటే ఆ రోజుల్లో భయంకర భూలోక నరకం. అక్కడ భయంకరమైన రాక్షసిదోమలు కుడితే మరణకారక వ్యాధులు వచ్చేవి మన స్వాతంత్ర్యోద్యమ సమయంలో స్వాతంత్ర్యం కోసం పోరాడే దేశభక్తులను బ్రిటిష్ నిరంకుశ ప్రభుత్వం ఉరిశిక్ష విధించేవారికి ఉరిశిక్ష విధించి, తక్కిన వారికి యావజ్జీవ శిక్ష విధించి అండమాన్‌కు పంపేది. అక్కడి భయంకర, అనారోగ్య వాతావరణానికి తట్టుకోలేక ఎందరో దేశభక్తులు శిక్ష ముగిసేవరకు కూడా వుండలేక, మధ్యలోనే మరణించేవారు.



అయితే, వీరసావర్కార్ అండమాన్ జెయిల్లో కొబ్బరి పీచు నుంచి త్రాళ్ళు పేనుతూ, అక్కడి పోలీసుల నుంచి దుర్భర దూషణావమానాలను భరిస్తూ 1924లో అనారోగ్య కారణాలపై ఇండియాకు పంపబడ్డారు. 1937 లో బొంబాయిలో కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడిన తరువాత సావర్కార్‌పై నిర్బంధాలు తొలగించి, ఆయనను విడుదల చేసింది. సావర్కార్ జీవిత చరిత్ర భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో సువర్ణాక్షర లిఖితమైన పేజీ!

## గంతకు తగ్గ బొంత !

బ్రిటిష్ పాలనలో మన నాయకులు కొందరు వారి ప్రభుత్వంలో ఉన్నత పదవులు అనుభవిస్తూనే, అవసరం వచ్చినప్పుడు వారికి చురకలు అంటించేవారు. వారికి చెప్పదలచింది కుండ బ్రద్దలు కొట్టినట్టు ముఖంమీదే చెప్పేవారు.

సర్ శంకరన్‌నాయర్ అఖిల భారత కాంగ్రెసు అధ్యక్ష పదవి నిర్వహించారు. ఆయన హైకోర్టు జడ్జి పదవి, వైస్రాయి కార్యవర్గంలో సభ్యత్వం నిర్వహించారు. వైస్రాయి కార్యవర్గంలో సభ్యత్వం అంటే ఇప్పటి కేంద్ర మంత్రిత్వంతో సమానం.

అప్పటిలో ఢిల్లీలోని బ్రిటిష్ ప్రభుత్వం అనుసరించే పంజాబ్ విధానాన్ని వ్యతిరేకిస్తూ శంకరన్‌నాయర్ తన పదవికి రాజీనామా చేశారు ఆయన రాజీనామాను ఆమోదించబోనని వైస్రాయి చెమ్స్‌ఫర్డ్ అనగా, ఆమోదించితీరాలని శంకరన్‌నాయర్ పట్టుబట్టారు ఎట్టకేలకు రాజీనామాను ఆమోదించిన తరువాత వైస్రాయిని ఆఖరు సారి లాంఛనంగా ఒకసారి చూద్దామని శంకరన్‌నాయర్ ఆయనను కలుసుకున్నారు.

కుశల ప్రశ్నలు అయిన తరువాత వైస్రాయి "మిష్టర్ నాయర్! మీ స్థానంలో కొత్త మెంబర్‌గా ఎవరిని వేస్తే బాగుంటుందంటారు?" అని అడిగారు.

వెంటనే శంకరన్‌నాయర్, కొంచెం దూరంలో చేతులు కట్టుకుని నిలబడి వున్న వైస్రాయిగారి పరిచారకుణ్ణి చూపిస్తూ "అతడైతే మీకు సరిపోతాడు" అన్నారు.

వైస్రాయి చెమ్స్‌ఫర్డ్ నాయర్ వంక ఆశ్చర్యంగా చూచి "అదేమిటి, వేళా కోళమా?" అన్నారు.

"వేళాకోళం కాదు. మీ అటెండర్ మంచి పొడగరి, అందగాడు. మీరేది చెప్పినా "యస్సార్" అంటాడు. మీకు కావలసింది అలాంటివాడేగా!" అనేసరికి ఆ తెల్లవైస్రాయి తెల్లబోయాడు! మన పరిపాలకులలో చాలామందికి "యస్ మన్"లే తమ సలహాదార్లుగాను, మంత్రులుగాను, సెక్రటరీలుగాను వుండాలని వుంటుంది. ఆ ధోరణి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మరీ పెరిగిపోయింది!

## పార్లమెంటు పైకెక్కిన ఆచార్య రంగా !

పార్లమెంటు హౌస్‌లో అంతర్జాతీయ రైతాంగ నాయకుడు ఆచార్య ఎన్. జి. రంగా కాంస్య విగ్రహాన్ని ఉపరాష్ట్రపతి కృష్ణకాంత్ ఆవిష్కరించారు. గుంటూరు జిల్లాలోని నిడుబ్రోలుకు చెందిన ఆచార్య రంగా ఒక సాధారణ రైతు కుటుంబానికి చెందినవారు. ఉన్నత విద్యాభ్యాసానికి ఇంగ్లాండ్ వెళ్ళి, ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో ఆర్థిక శాస్త్రంలో డిగ్రీ తీసుకుని మద్రాసు పచ్చయప్ప కళాశాలలో ప్రొఫెసర్‌గా పనిచేస్తూ ఉద్యోగానికి రాజీనామా చేసి, స్వాతంత్ర్యోద్యమంలో చేరారు. తరతరాలుగా పీడితులుగా, బాధితులుగానే మిగిలిపోయిన భారత రైతాంగం తరఫున వారి కష్ట నిష్ఠూరాల తొలగింపుకై ఎన్నో ఉద్యమాలు నిర్వహించి, రైతు రంగాగా పేరుపొంది, మొత్తం 50 సంవత్సరాలపాటు పార్లమెంటు సభ్యత్వం నిర్వహించి, గొప్ప పార్లమెంటేరియన్‌గా పేరు పొందిన ఆచార్య రంగా స్వాతంత్ర్యోద్యమ సమయంలో ఢిల్లీలోని కేంద్ర అసెంబ్లీ భవనంపై—అంటే ఇప్పటి పార్లమెంటు భవనంపై—బ్రిటిష్ పోలీసుల కన్నుగప్పి, కాంగ్రెసు పతాకాన్ని ఆవిష్కరించిన స్వాతంత్ర్య సమరయోధుడు. ఆయన ఏ ప్రభుత్వ పదవినీ ఆశించని నిష్కళంక చరిత్రుడు. గొప్ప వక్త. కారల్‌మార్క్స్ "ప్రపంచ కార్మికులారా ఏకం కండు!" అన్న నినాదమిస్తే, ఆచార్య రంగా "ప్రపంచ కర్షకులారా! ఏకం కండు" అన్న నినాదమిచ్చారు.

అట్టి మహానాయకుని విగ్రహాన్ని పార్లమెంట్ హౌస్‌లో ఆలస్యంగానైనా ఆవిష్కరించడం ఎంతైనా సముచితం.



## "క్విట్ ఇండియా"

ఆగస్టు నెల అనగానే భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ఒక మహోజ్వలమైన ఘట్టం జ్ఞాపకం వస్తుంది.

"ఎంతకాలమిటు సహించి వున్నా, దోపిడి మూకకు దయరాదన్నా!" అన్నట్టు, స్వాతంత్ర్యం కోసం బ్రిటిష్ ప్రభుత్వంతో తీర్మానాల ద్వారా, చర్చల ద్వారా, సత్యాగ్రహాల ద్వారా ఎంతకాలం పోరాడినా, బ్రిటిష్ ప్రభుత్వం ససేమిరా అంటున్నది.

పైగా, భారతీయ నాయకులతో సంప్రతించకుండా, వారి అనుమతి లేకుండా ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో భారతదేశాన్ని కూడా తమ తరపున భాగస్వామిగా బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించింది.

"మాకు స్వాతంత్ర్యం ఇవ్వండి. ప్రజాస్వామ్య దేశాల తరపున మేము నాజీ జర్మనీ, ఫాసిస్టు ఇటలీ, జపాన్‌లతో పోరాడుతా"మని భారతీయ నాయకులు చెప్పినా, బ్రిటిష్ ప్రభుత్వం వినలేదు. "ఇప్పుడు మాతో సహకరించండి యుద్ధానంతరం మీకు స్వాతంత్ర్యమిస్తా"మని బ్రిటిష్ ప్రభుత్వం పేర్కొన్నది.

ఇక లాభం లేదని మహాత్మాగాంధీ "క్విట్ ఇండియా" అని బ్రిటిష్ ప్రభుత్వానికి అంత్య సందేశమిచ్చారు. "ఇక మా దేశాన్ని విడిచిపొండి. లేకపోతే మీరు విడిచి వెళ్ళేవరకు మీతో సహాయ నిరాకరణమే" అని భారత జాతీయ కాంగ్రెస్ స్పష్టం చేసింది.

"క్విట్ ఇండియా" తీర్మానాన్ని ఆమోదించడానికి అఖిల భారత కాంగ్రెసు కమిటీ ఆగస్టు 6,7,8 తేదీలలో బొంబాయిలో సమావేశమైంది. 8వ తేదీ రాత్రి మహాత్మాగాంధీ ఏ.ఐ.సి.సి. సమావేశంలో మహోపన్యాసం చేశారు. బ్రిటిష్ ప్రభుత్వంతో "చావో, బ్రతుకో" తేల్చుకుందామన్నారు. "ఇక మూట ముల్లె సర్దుకుని మీ దేశానికి వెళ్ళిపొండి" అని బ్రిటిష్ ప్రభుత్వానికి శంఖారావం పూరించారు.

ఆగస్టు 9వ తేదీ తెల్లవారు ఝామున మహాత్మాగాంధి మొదలైన జాతీయ నాయకులందరిని బ్రిటిష్ ప్రభుత్వం అరెస్టుచేసి, అజ్ఞాత ప్రదేశానికి తీసుకు

వెళ్ళింది. నాయకులను పరాయి ప్రభుత్వం ఏమి చేసిందో తెలియక, ప్రజలు ఆగ్రహోదగ్రులై ఆవేశంతో టెలిగ్రాఫ్ తీగలు తెంపి వేశారు; రైలు పట్టాలు తొలగించారు; పోస్టాఫీసులను, రైల్వేస్టేషనులను దగ్ధం చేశారు. ప్రజల ఆవేశం కట్టలు తెంచుకుంటే, ఆంతే. దానికి అడ్డు కట్ట వేయడం ఎవరితరం?

బ్రిటిష్ ప్రభుత్వం దెబ్బతిన్న బెబ్బులి వలె తన క్రౌర్యాన్ని ప్రదర్శించింది. క్విట్ ఇండియా ఉద్యమాన్ని అణచివేయడానికి దమన నీతికి ఉద్యమించింది. కొందరిపై తుపాకులు ప్రయోగించింది; ఎందరినో అరెస్టు చేసింది. జెయిళ్ళు దేశభక్తులతో నిండిపోయాయి. బ్రిటిష్ సామ్రాజ్యవాదపు కోటగోడలు బీటలువారి, కదిలిపోయాయి ఇక, భారతదేశాన్ని తుపాకులు చూపి పాలించలేమన్న భావన బ్రిటిష్ ప్రభుత్వానికి కలిగింది.

1945లో ద్వితీయ ప్రపంచ సంగ్రామం ముగిసిన తరువాత బ్రిటిష్ ప్రభుత్వము ఇక లాభం లేదని, భారతదేశానికి స్వాతంత్ర్యం ఏదో రూపంలో ఇవ్వకతప్పదన్న నిశ్చయానికి వచ్చిన సూచనలు కనిపించాయి.

అలా మన స్వాతంత్ర్యోద్యమంలో "క్విట్ ఇండియా" తీర్మాన ఘట్టం ఒక ప్రత్యేకతను, విశిష్ట స్థానాన్ని సంతరించుకున్నది; ఆ ఘట్టం మహాత్మాగాంధి నాయకత్వాన భారతజాతి బ్రిటిష్ ప్రభుత్వంపై జరిపిన స్వాతంత్ర్య పోరాట ఘట్టాలలో తలమానికమైనది.

## హంతకునికి హారతులా ?

అలాంటి మహానాయకుని, ప్రపంచశాంతి దూతను, స్వాతంత్ర్య ప్రదాతను, లోక కళ్యాణ సంధాతను దారుణంగా చంపిన హంతకుడు గాడ్సే. భారత జాతి ప్రపంచ రాజ్యాలలో తలవంచుకునేటట్టు చేయడమే ఘోరనేరమైతే, ఆ హంతకుని చర్యను కీర్తిస్తూ నాటకం వ్రాయడం ఎంత నేరం! వక్రమార్గం పట్టిన ఒక రచయిత వ్రాసినా, దాన్ని ప్రదర్శించడానికి అనుమతించడం ఎంత నేరం! సరే, ప్రదర్శించడానికి మతిమాలిన ఒక కమిటీ అనుమతించిందనుకుందాం. మరి, ఆ సిగ్గు మాలిన నాటకంలోని మతోన్మాది పాత్ర డైలాగ్స్‌కు హర్షధ్వానాలు చేసిన ప్రేక్షకుల మానసిక స్థితిని, నీతి మాలిన చర్యను ఏమనాలి?



పైగా, ఆ నాటకాన్ని ఒకటి, రెండుసార్లు కాదు.... ఎన్నోసార్లు ప్రదర్శించారట! కన్నతల్లిపై అత్యాచారం చేసిన వాడిని, కన్నతండ్రిని హతమార్చిన వాడిని ఎవరైనా హర్షిస్తారా?

హే! స్వతంత్ర భారతీ! నీకు స్వాతంత్ర్యం లభించిన ప్రథమ సంవత్సరంలోనే! జాతిపితను పొట్టను పెట్టుకున్నందుకు సిగ్గుపడుతుంటే, నీ స్వర్ణోత్సవ సంవత్సరంలో ఆ లోకారాధ్యుని పవిత్ర స్మృతికి అపచారం జరిగినందుకు నీ మ్రోల సిగ్గుతో తలవంచుకుంటున్నాము!

## చిన్ననాటనే "దేశబంధు"

చిత్తరంజన్‌దాసు మనలో చాలా మంది పేరు. అయనకు "దేశబంధు" బిరుదు. "దేశబంధు" చిత్తరంజన్‌దాసు ఒక మహానాయకుడు. నీతి నిజాయితీలకు మారుపేరు; దేశభక్తికి మరో పేరు.

అంతేకాదు—నేతాజీ సుభాష్‌చంద్రబోసుకు గురువరేణ్యుడు కూడా.

చిన్నప్పుడు పాఠశాలలో చదివేటప్పుడు ఆయన ఉత్తమ విద్యార్థిగా పేరు పొందాడు. ఖాళీ సమయాలలో కాలం వృథా చేయకుండా వివిధ మత గ్రంథాలు చదివి, వాటిలోని మహత్సూక్తులను తన డైరీలో వ్రాసుకుని, తన తోటి విద్యార్థులకు చదివి వినిపించేవాడు ముఖ్యంగా దానధర్మాలు, సహాయ గుణాలకు సంబంధించిన అంశాలను ప్రత్యేకించి వ్రాసుకుని మరీ వినిపించేవాడు. వారందరిని ఒక సంఘంగా ఏర్పరచి, సొమ్ము సేకరించి, క్లాసు పుస్తకాలు కొని, అవి లేనివారికి ఇచ్చేవాడు.

ఒకసారి చిత్తరంజన్‌దాసు ఒక దళిత బాలునికి అలా పుస్తకాలు ఇవ్వగా, ఈ సంగతి తెలిసిన కొందరు తల్లిదండ్రులు ఆగ్రహించి ఆ ఉపాధ్యాయునిపై విరుచుకుపడ్డారు. ఆయన మాత్రం ఏమి చేస్తాడు? ఈ పని దాసు చేశాడని తెలుసుకుని, ఆ తల్లిదండ్రుల సమక్షంలోనే ఆయన నిలదీసి ప్రశ్నించాడు.

అప్పుడు బాలుడైన చిత్తరంజన్‌దాసు ఇలా ప్రత్యుత్తరమిచ్చాడు.

"ఇంతమంది పెద్దలు కలిసి, నేనేదో ఘోర నేరం చేసినట్టు నన్ను నిలదీస్తు

న్నారు. ఆపదలో వున్నవారికి, అవసరంలో వున్నవారికి వారు ఏ మతం వారైనా, ఏ కులం వారైనా సహాయం చేయమని అన్ని మత గ్రంథాలు చెబుతున్నాయి. సర్వం తెలిసిన మీవంటి పెద్దలు మంచిచేసిన నన్ను తప్పు పడుతున్నందుకు నా దురదృష్టంగా భావిస్తున్నాను,

అయితే, ఇక ముందు నేను ఇలాంటి మంచి పనులు చేయనని మాత్రం అనుకోకండి. నేను బ్రతికినంతకాలం ఇలాంటి పనులే చేస్తాను" అన్నాడు.

అలాంటి పనులు చేశాడు కనుకనే పెద్దయిన తరువాత చిత్తరంజన్‌దాసు దేశబంధు అయినాడు! ఆయనకు ఆ బిరుదు ఇచ్చింది ఎవరో కాదు—మహాత్మాగాంధి!

## జెండా వీరుడు

ప్రతి దేశానికి ఒక పతాకం వుంటుంది. ఆ పతాకం ఆ జాతి ప్రతిష్ఠ,ఆశయ లక్ష్యాలు, జాతీయతలకు ప్రతీక. పతాకకు అవమానం జరిగితే, అది జాతికే అవమానం; జాతీయ జెండాకు అపచారం జరిగితే, దేశానికే జరిగినట్టు.

స్వాతంత్ర్యోద్యమ సమయంలో కాంగ్రెసు జెండానే జాతీయ పతాకంగా భావించారు— అది ఒక పార్టీజెండా అయినప్పటికీ! ఎందువల్లనంటే, అనాడు కాంగ్రెసు దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడే అన్ని శక్తులకు ప్రతినిధిగా భాసిల్లింది.

కాగా, 'ఏ దేశ చరిత్ర' చూచినా, పతాక గౌరవ రక్షణ కోసం జరిగిన యుద్ధాలు, పోరాటాల అధ్యాయాలు కోకొల్లలుగా కానవస్తాయి.

మన ఆంధ్రప్రదేశ్‌లో స్వాతంత్ర్యోద్యమ చరిత్రనే చూడండి. మచిలీపట్నం కోనేరు సెంటరు వద్ద ధ్వజస్తంభంపై త్రివర్ణ పతాకను ప్రతిష్ఠించాలన్న పట్టుదలతో అప్పటిలో ఒక యువసత్యాగ్రహి ఒకప్రక్క పోలీసులు లాఠీలతో మోదుతున్నా లెక్కచేయకుండా, ఆ స్తంభాన్ని ఎక్కి పతాకను ప్రతిష్ఠించి కాని కిందకు దిగలేదు. తాము లాఠీలతో మోదుతున్నా పతాక స్తంభాన్ని అధిరోహించి,పతాకాన్ని ప్రతిష్ఠించాడన్న కోపంతో, కసితో ఆయన దిగివచ్చిన తరువాత పోలీసులు మరింతగా బాద మోదారు. కిందకు దిగగానే సొమ్మసిల్లి పడిపోయాడు. ఆ జెండా వీరుడు. ఆయన పేరే శ్రీ తోట నరసయ్య!



## లాల్ బహదూర్ స్త్రీ పాత్ర!

నాగపూర్ జెండా సత్యాగ్రహంలో జెండాను ప్రతిష్ఠించడానికి దేశం నలుమూలల నుంచి వేలాది సత్యాగ్రహులు నాగపూర్ వెళ్ళి, లాఠీ దెబ్బలు తిని, కారాగారానికి వెళ్ళారు.

అలహాబాద్‌లో ధ్వజ స్తంభంపై జాతీయ పతాకను ఆవిష్కరించనివ్వకూడదని పోలీసులు పట్టుబట్టినప్పుడు శ్రీ లాల్ బహదూర్‌శాస్త్రి ఆడవేషం ధరించి పోలీసులను మోసగించి, పతాక ప్రతిష్ఠాపన చేశారు!

అంతటి మహత్తర చరిత్రగల—ఆ తరువాత త్రివర్ణాంచిత ధర్మచక్ర సుశోభితమైన భారత జాతీయ పతాకగా అవతరించిన ఆ మూడు రంగుల పతాక నిర్మాత ఎవరు?

ఆయనే, తెలుగువాడైన పింగళి వెంకయ్యగారు. ఆంధ్రులకు గర్వకారకుడు. ఆగస్టు 2వ తేదీ ఆయన జన్మదినోత్సవం. బహుముఖ ప్రజ్ఞాశాలి, మహామేధావి అయిన పింగళి వెంకయ్యగారు 1878 ఆగస్టు 2వ తేదీన కృష్ణాజిల్లా భట్లపెనుమర్రులో జన్మించారు.

## జాతీయ పతాక సృష్టికర్త

పింగళి వెంకయ్యగారు జాతీయ పతాకాన్ని సృష్టించడానికే జన్మించారా? అనిపిస్తుంది. తనకు 29 సంవత్సరాల వయస్సులో 1906లో కలకత్తాలో దాదాభాయ్ నౌరోజీ అధ్యక్షతన జరిగిన కాంగ్రెసు మహాసభకు ఆయన హాజరుకాగా, అప్పటికి మనకు జాతీయ పతాక లేనందున, బ్రిటిష్ పతాకనే ఆవిష్కరించడం వెంకయ్యగారికి ఆవేదన, ఆలోచన కలిగించింది.

అప్పుడే ఆయన భారత జాతీయ కాంగ్రెసుకు ఒక జాతీయ పతాకాన్ని రూపొందించాలన్న ఆలోచన కలిగింది. ఈ సమస్యను గురించి అప్పుడే ఆయన దాదాభాయ్ నౌరోజీ, లోకమాన్య తిలక్, లాలాలజపతిరాయ్, మోతీలాల్‌నెహ్రూ, బిపిన్‌చంద్రపాల్, రవీంద్రనాథ్‌టాగోర్ మొదలైన వారితో చర్చలు సాగించారు.

"భారత దేశానికి ఒక జాతీయ పతాకం" అన్న పేరుతో 1916లో తాను రచించిన గ్రంథంలో పింగళి వెంకయ్యగారు 30 రకాల పతాకాలను గురించి చర్చించారు. వాటిలో మువ్వన్నెల జెండా నమూనా కూడా వున్నది.

కాగా, 1921 మార్చి 31, ఏప్రిల్ 1వ తేదీలలో విజయవాడలో అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశాలు జరుగుతుండగా, మహాత్మాగాంధి పింగళి వెంకయ్యగారిని పిలిచి, ఒక జాతీయ పతాకాన్ని తయారు చేయవలసిందిగా కోరారు. బందరు ఆంధ్ర జాతీయ కళాశాలలో పనిచేస్తున్న శ్రీ ఈరంకి వెంకటశాస్త్రి తోడ్పాడుతో వెంకయ్యగారు మూడు గంటల వ్యవధిలో త్రివర్ణ పతాకను రూపొందించి, గాంధీజీకి సమర్పించారు. పైన ఎరుపు, మధ్య తెలుపు, కింద ఆకుపచ్చ రంగులతో ఆ జెండా చూపరులకు ఆకర్షణీయమైనది. దాన్ని ఏ.ఐ.సి.సి. ఆమోదించింది. అప్పటినుంచి అదే భారత జాతీయ కాంగ్రెసు జెండా.

తరువాత భారతదేశం స్వతంత్రమై, జాతీయ పతాకం కావలని వచ్చినప్పుడు అంతకు పూర్వపు త్రివర్ణ పతాకలోని రాట్నానికి బదులుగా అశోక చక్రాన్ని చేర్చారు. అదే నేటి భారత జాతీయ జెండా!

ఝుండా ఊంఛా రహే హమారా!

## "ఆమెలో వున్నవి నాలో లేవు"

ప్రపంచ ప్రఖ్యాత తత్త్వవేత్త, సాపేక్ష సిద్ధాంతకర్త ఐన్‌స్టీన్ హాస్య సంభాషణా చతురుడు కూడా. ఒకసారి ఆయన న్యూయార్క్ నగర వీధులలో నడిచి వెడుతున్నాడు, ఆయన వెనుకనే వస్తున్న ఒక మిత్రుడు "ఐన్‌స్టీన్‌గారూ! మీరు చాలా దూరం నుంచి నడిచి వస్తున్నారు. మిమ్మల్ని ఎవ్వరూ పట్టించుకున్నట్టు లేదు. మీ వంక ఎవ్వరూ చూడను కూడా చూడ్డంలేదు. కాని, ఈ ఉదయమే ఈ రోడ్డు వెంట ప్రసిద్ధ హాలీవుడ్ అందాల తార మర్లిన్ మన్రో కొంచెం దూరం వెళ్ళేసరికి ఆమెను జనం విరగబడి చూశారు. ఇంత గొప్పవారైనా మిమ్మల్ని ఎవ్వరూ పట్టించుకోలేదు. ఏ గొప్పతనం లేని ఆమెకు అంత విలువ దేనికి?" అన్నాడు.

వెంటనే ఐన్‌స్టీన్ "మిత్రమా! ఆమెలో చూడ్డానికి కొన్ని విశేషాలున్నాయి; నావద్ద ఏమున్నదని చూస్తారు?" అనేసరికి ఆ మిత్రుడు కూడా చిరునవ్వులు చిందించాడు. ఔను! సినిమా గ్లామరుకు అమెరికా ఏమిటి? ఇండియా ఏమిటి?



కొస మెరుపు; అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షుడు, కేంద్ర హోమ్‌మంత్రి, మహారాష్ట్ర గవర్నర్ పదవులు నిర్వహించిన కాసు బ్రహ్మానందరెడ్డిగారు ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు ఆయనను ఒక సినీ తారల ఉత్సవానికి ముఖ్య అతిథిగా నేను ఆహ్వానించినప్పుడు ఆయన "సినీతారల ముందు మన ముఖాలు ఎవరు చూస్తారండీ! నన్ను వదిలిపెట్టండి బాబూ" అన్నారు. ఐన్‌స్టీన్ వ్యాఖ్య కూడా అలాంటిదే.

## ఆ అగష్టు 15 అర్థరాత్రి....

అగస్టు 15వ తేదీ—శతాబ్దాల తరబడి దాస్య తిమిరంలో క్రుగ్గిన భారతావనిపై, స్వాతంత్ర్య భానూదయమైన రోజు. యావద్భారత జాతి—ఆసేతు శీతనగ పర్యంతం—ఆనందోత్సాహాలతో తమ చిరనిరీక్షిత మధుర స్వప్నం ఫలించిందన్న సంబరంతో ప్రథమ స్వాతంత్ర్యదినోత్సవం జరుపుతున్న వేళ; ఢిల్లీ ఎర్రకోటపై త్రివర్ణాంచిత ధర్మచక్ర సుశోభితమైన భారత జాతీయ పతాకం రెపరెపలాడుతూ సగర్వంగా వినువీధిలో ఎగిరిన వేళ.

ఆ రోజు స్వాతంత్ర్యావతరణ ఆనందోత్సాహాలను చూడగలిగిన వారిది నిజంగా అదృష్టం. ఎందరు భారతీయ దేశభక్తులు—వీరులు, వీరాంగనలు—ఆ రోజు కోసం ఎన్ని త్యాగాలు చేశారు!

కొందరు లాఠీదెబ్బలు తిన్నారు; మరికొందరు తుపాకి గుళ్ళకు నేల కొరిగారు, ఇంకొందరు రుధిరాశ్రువులు కురిపించారు; వేరొక కొందరు కారాగారవాస క్లేశాన్ని అనుభవించారు. ఎందరో తమ ఆస్తిపాస్తులను కోల్పోయారు. ఎందరో ఎన్నెన్నో త్యాగాలు చేస్తే మనకు ఈ స్వాతంత్ర్యం సిద్ధించింది.

1947 అగస్టు 14వ తేదీ అర్థరాత్రి దాటిన మరుక్షణంలో స్వతంత్ర భారతి ఆవిర్భవించింది.

ప్రముఖ కాంగ్రెసు నాయకురాలు, ఆ తరువాత యు. పి ముఖ్యమంత్రిణి

అయిన సుచేత కృపలానీ "సారే జహాసే అచ్చా హిందూస్తాన్ హమారా!" అన్న ప్రఖ్యాత కవీంద్రుడు మహమ్మద్ ఇక్బల్ విరచిత గేయాలాపనతో భారతదేశానికి స్వాతంత్ర్య ప్రధాన కార్యక్రమం ప్రారంభమైనది.

భారత రాజ్యాంగ పరిషత్తులో బ్రిటిష్ ప్రభుత్వం తరఫున వైస్రాయి లార్డ్ మౌంట్‌బాటెన్ భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రదానం చేశారు.

ఆ అర్ధరాత్రి ప్రధాని నెహ్రూ "ట్రిస్ట్ విత్ డెస్టినీ" అంటూ చేసిన మహోపన్యాసం చరిత్రలో నిలిచిపోతుంది.

ఆ అర్ధరాత్రి ఆయన భారత జాతిని, యావత్ప్రపంచాన్ని ఉద్దేశించి చేసిన ప్రసంగంలో "ఇప్పుడు యావత్ప్రపంచం గాఢ సుషుప్తిలో వుండగా, భారతదేశం చిరదాస్యతిమిరాలను చీల్చుకొని స్వతంత్రదేశమైనది. ఈ గడియకోసం మనం ఎన్నో దశాబ్దాలుగా నిరీక్షిస్తున్నాము. ఈ క్షణంలో మనమిక్కడ వుండగలగడం ఎంత అదృష్టం!" అన్నారు.

రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షుడు డాక్టర్ రాజేంద్ర ప్రసాద్, డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ ప్రభృతులు ప్రసంగించారు.

## "పండిట్ మౌంట్ బాటెన్‌కు జై!"

మరునాడు ఉదయం స్వతంత్ర భారతం తొలి గవర్నర్-జనరల్ లార్డ్ మౌంట్ బాటెన్, ప్రధాని నెహ్రూ ఢిల్లీ పురవీధులలో గుర్రపు బగ్గీపై ఊరేగుతూ ఎర్రకోట వద్దకు పతాక ప్రతిష్ఠాపనోత్సవంలో పాల్గొనడానికి వెడుతున్నారు. వారిని సందర్శించడానికి ఢిల్లీ పురవీధులలో లక్షలాది ప్రజలు జయ జయధ్వానాలు చేస్తూ నిరీక్షిస్తున్నారు.

ప్రత్యేక శకటంలో ఊరేగుతున్న ప్రధాని నెహ్రూ ఒక యువకుడు అందించిన పుష్పగుచ్ఛాన్ని వంగి స్వీకరించబోయే సరికి ఆయన ఆ శకటంపై నుంచి క్రింద పడినంత పని జరిగింది వెంటనే ప్రక్కనే వున్న లార్డ్‌మౌంట్‌బాటెన్ పండిట్ నెహ్రూను పట్టుకుని పడిపోకుండా ఆపేసరికి జన సందోహం ఆనందాతి



రేకంతో "పండిట్ మౌంట్ బాటెన్‌కు జై" అంటూ జయ జయ ధ్వానాలు చేశారు!

## "విప్లవ మహర్షి"

ఆగస్టు 15వ తేదీ మరొక మహనీయుని జన్మదినోత్సవం. ఆయనే—భారతీయ విప్లవకారుడు. ఆ తరువాత ప్రపంచ ప్రఖ్యాత ఆధ్యాత్మిక వేత్త. ఇంగ్లీషులో గొప్ప పత్రికా సంపాదకుడు-అరవింద ఘోష్. అయితే, ఆయన అరవిందఘోష్‌గా సుపరిచితుడు- భారతీయ విప్లవకారుడుగా వున్నప్పుడే! ఆ తరువాత అరవిందయోగి అరవింద మహర్షిగా ప్రపంచానికి సుపరిచితులు.

ఆయన జీవితం వైవిధ్యభరితం. కలకత్తాలో ఒక సంపన్న బెంగాలీ కుటుంబంలో జన్మించిన ఆయన చిన్నప్పుడే తండ్రి పంపగా లండన్ వెళ్ళి, అక్కడ నూటికి నూరుపాళ్ళు ఇంగ్లీషు వాతావరణంలో పెరిగి, ఐ.సి.ఎస్. చదివి, బ్రిటిష్ ప్రభుత్వం కింద ఉద్యోగిగా పని చేయడం ఇష్టంలేక, ఐ.సి.ఎస్. పరీక్షలో భాగమైన గుర్రపు స్వారీని కావాలని తిరస్కరించి, ఇండియా తిరిగి వచ్చిన తరువాత బరోడా కాలేజీలో పనిచేసి, భారత స్వాతంత్ర్యోద్యమం వైపు ఆకర్షితుడై తీవ్రవాదులతో చేతులు కలిపి, విప్లవకారుడుగా మారారు. ఎన్ని రూపాంతరాలు!

కలకత్తాలోని అరవిందుని కుటుంబానికి చెందిన మానిక్‌తలా గార్డెన్‌లో బాంబులు, ఆయుధాలు, విప్లవ సాహిత్యం పోలీసులకు లభించగా, వారు అరవిందునిపై అలీపూర్ కుట్ర కేసును బనాయించారు. చరిత్రాత్మకమైన ఆ కేసులో అరవిందుని తరఫున ప్రఖ్యాత జాతీయ నాయకుడు, న్యాయవాది దేశబంధు చిత్తరంజన్ దాసు వాదించారు.

కోర్టులో అరవిందుడు ప్రకటన చేస్తూ "నేను స్వాతంత్ర్యం కోసం కృషి చేయడమే నేరమైతే ఆ నేరాన్ని నేను అంగీకరిస్తున్నాను. అదే నా తప్పయితే, నా చేతికి సంకెళ్ళు వేయండి; నన్ను జైలుకు పంపండి. మీరు ఏమి చేసినప్పటికీ, నేను చేసింది తప్పని మాత్రం మీరు నాచేత అనిపించలేరు."

బ్రిటిష్ ప్రభుత్వం ఎన్ని విధాల కూట సాక్ష్యాలు ప్రవేశపెట్టినా, ఆయనపై

రాజద్రోహం నేరం నిరూపితం కానందున, కేసు కొట్టివేశారు అంతవరకు జైలులో వున్న అరవిందునికి "వాసుదేవ సాక్షాత్కారం"లో ఏదో అనిర్వచనీయమైన దివ్య తేజం గోచరించడంతో ఆయనలో మహత్తర పరివర్తనం వచ్చింది.

ఆ తరువాత ఆయన తన మకాం పుదుచ్చేరికి మార్చి, అక్కడ ఒక ఆశ్రమం నెలకొల్పి, ప్రపంచానికి వినూత్నమైన ఆధ్యాత్మిక సందేశం అందించారు. ఆయన సందేశ సారాంశం—విశ్వశాంతి, ప్రేమ.

ఆయన అంతకు పూర్వం "వందేమాతరం" అను జాతీయ పత్రికకు సంపాదకత్వం వహించారు. అయన వ్రాసిన "సావిత్రి" అనే మహాకావ్యం ఇంగ్లీషు సాహిత్యానికే మణిపూస అని ఇంగ్లీషు సాహితీ విమర్శకులే ప్రశంసించారు. రవీంద్ర కవీంద్రుని శాంతినికేతన్ ఒక అంతర్జాతీయ విద్యాకేంద్రంగా ప్రపంచ వ్యాప్తంగా ఎలా పేరు పొందిందో, పుదుచ్చేరిలోని అరవిందాశ్రమం కూడా అంతర్జాతీయ ఆధ్యాత్మిక కేంద్రంగా, దివ్యజీవనపథ నిర్దేశకంగా పరిఢవిల్లుతున్నది.

అరవిందుని పుట్టినరోజు, భారత స్వాతంత్ర్యావతరణ రోజు ఒకటి కావడం ఎంత విశేషమో, 1950 డిశెంబర్ 5వ తేదీన అరవిందుడు నిర్యాణం చెందిన తరువాత అయిదు రోజుల వరకు ఆయన శరీరాన్ని ఒక అనిర్వచనీయమైన దివ్యతేజం ఆవరించడం అంతకంటె విశేషం. ఆయన శరీరం చెడిపోలేదు. అది గొప్ప విశేషం. భారతీయ మహనీయుల్లో మహానుభావుడు అరవింద మహర్షి.

## తల తెగిపోయినా చలించని ఝాన్సీలక్ష్మి

1947లో భారత దేశానికి స్వాతంత్ర్యం రావడానికి 90 సంవత్సరాల ముందు—1857లో ప్రథమ భారత స్వాతంత్ర్య సమరం జరిగింది.

ఆ స్వాతంత్ర్య సమర సర్వసేనాని ఝాన్సీలక్ష్మీబాయి అని చెప్పవచ్చు. ఆమెతో కలిసి మెలిసి పోరాడిన సహ సేనానులు నానాసాహెబ్, తాంతియాతోపే, బేగం హజరత్ మహల్, రాణా కున్వర్ సింగ్ ప్రభృతులు. వీరిలో ప్రతివారు ఆ మహా సమరంలో సర్వసేనాని కాదగినవారే. వీరిలో ఝాన్సీలక్ష్మీబాయి పోరాట పటిమ, అరవీర భయంకరంగా ఆమె ప్రదర్శించిన ధైర్యసాహసాలు, ఆ యుద్ధ ఘట్టాలు తలచుకుంటే ఏ దేశ భక్తునికయినా రక్తం ఉప్పొంగుతుంది.



ఆ స్వాతంత్ర్య సమరంలో తమపై కత్తికట్టిన ఝాన్సీ రాజ్యాన్ని ఆక్రమించడానికి బ్రిటిష్ సేనలు కోటలో ప్రవేశించాయి. ఆ ఘోర యుద్ధంలో రాణి లక్ష్మిబాయి సేనానులు ఖుదాబక్స్, గౌస్‌ఖాన్‌లు మృతి చెందారు. లక్ష్మీబాయి తాను బ్రిటిష్ సైనికుల చేజిక్కితే అవమానిస్తారని ఆ రాత్రే పురుష వేషం ధరించి, తన దత్తపుత్రుని వీపుపై కట్టుకుని, కోట గోడపైనుంచి కిందవున్న ఏనుగుపైకి దూకి, అక్కడ తన ప్రాణప్రదమైన గుర్రాన్ని యెక్కి పదిహేనుమంది సైనికులతో సురక్షితమైన స్థావరం వైపు పయనించసాగింది.

ఇంతలో బ్రిటిష్ సేనాని లెఫ్టినెంట్ బోకర్ ఆమెను సమీపించి అడ్డగించాడు. లక్ష్మీబాయి కత్తి దెబ్బతో ఆ సేనాని తల తెగి పడింది. అతని సైనికులను తప్పించుకుని, ఆమె పగలంతా ఎక్కడా ఆగకుండా మంచినీరయినా త్రాగకుండా వందమైళ్ళు గుర్రంపై హుటాహుటిని ప్రయాణం చేసి, అర్ధరాత్రి అయ్యేసరికి కాల్పీ అనే స్థావరం చేరుకున్నది. అక్కడి వరకు అమెను సురక్షితంగా చేర్చిన గుర్రం ఆ అయాసానికి తట్టుకోలేక ప్రాణం విడిచింది.

మరొక గుర్రాన్ని అధిరోహించి ఆమె కనిపించిన బ్రిటిష్ సైనికుల కుత్తుకలు ఉత్తరిస్తూ ముందుకు పోతున్నది. గ్వాలియర్ కోట చేరాలని ఆమె ప్రయత్నం.

దారిలో ఒక చిన్న కాల్వ అడ్డం వచ్చేసరికి ఆమె కొత్త గుర్రం దాన్ని దాటలేక బెదిరిపోయి అక్కడే తాత్సారం చేస్తున్నది. ఇంతలో మరొక బ్రిటిష్ అశ్వికదళం వచ్చి, లక్ష్మీబాయిపై విరుచుకు పడింది. అప్పటికి తన వెంట వున్న కొద్దిపాటి సైనికులు మరణించగా, దాదాపు ఏకాకి అయిన లక్ష్మీబాయి ధైర్యంతో తన కత్తితో ఆ బ్రిటిష్ అశ్వికులను ఎదుర్కొన్నది. అంతలో ఒక అశ్వికుడు వెనుకగా వచ్చి, కత్తితో ఆమె తలపై గట్టిగా దెబ్బ కొట్టాడు. దానితో ఆమె తల కుడి భాగం తెగి ఎగిరిపోయింది. కుడి కన్ను ఊడి కింద పడింది. అయినా ఆమె లెక్క చేయకుండా తన కత్తితో ఆంగ్ల సైనికుని వధించింది.

అంతలో మరొక ఆంగ్ల సైనికుడు వచ్చి ఆమె ఛాతీపై పొడిచాడు. తల నుంచి, ఛాతీ నుంచి రక్తం ధారగా ప్రవహిస్తున్నది. శరీరమంతా కత్తి పోట్లతో

తూట్లు పడిపోయింది. ఆ వీరాంగన క్రమంగా నీరసించి పోతున్నది. అంతటి విపత్కర సమయంలో కూడా ఆమె ధైర్యాన్ని కోల్పోలేదు. తన పవిత్ర శరీరాన్ని ఆంగ్లేయ సైనికులు తాకరాదనే శపథం మేరకు ఆమె తెల్ల సైనికులను ఆ స్థితిలో కూడా నరుక్కుంటూ, వారిని తప్పించుకుని, సుదూర ప్రాంతానికి వెళ్ళిపోయింది.

గాయాల బాధవల్లను, వాటినుంచి విపరీతమైన రక్తస్రావం వల్లను ఝాన్సీ రాణి సొలిపోయి, గుర్రంపై వాలిపోయింది, ప్రక్కనే వున్న విశ్వాసపాత్రుడైన ఆమె సేవకుడు రామచంద్రరావు దేశ్‌ముఖ్ గుర్రాన్ని మెల్లగా నడిపించుకుంటూ దగ్గరలో వున్న బాబా గంగాదాసు కుటీరానికి చేర్చాడు. బాబాజీ లక్ష్మీబాయి నోటిలో మంచినీరు పోశాడు. మరికొన్ని నిమిషాలకు ఆ మంచినీటి వలెనే ఆమె శరీరం కూడా మంచువలె చల్లబడిపోయింది. ఆ స్వాతంత్ర్య వీరాంగన వీరోచితంగా భారత స్వాతంత్ర్య చరిత్ర గర్భంలో కలిసిపోయింది!

## రైతుకు లేని గౌరవం రాజుకు దేనికి?

ఇదివరలో ఏ దేశ పరిపాలకులైనా నిరాడంబరత్వానికి ప్రాధాన్యమిచ్చేవారు. అంతేకాని, ఇప్పటి మన పరిపాలకులలో చాలామందివలె ఆడంబరం, అధికార దర్పం, అహంకారం ఒలకబోసేవారు కాదు. డాక్టర్ రాజేంద్రప్రసాద్ రాష్ట్రపతి పదవిలోను, రాజాజీ గవర్నర్-జనరల్ పదవిలోను, డాక్టర్ పట్టాభి మధ్యప్రదేశ్ గవర్నర్‌గా వున్నప్పుడు అతి నిరాడంబరంగా— ఆ పదవులు లేనప్పుడు ఎంత నిరాడంబరంగా వుండేవారో—అంతకంటె నిరాడంబరంగా వుండటానికి ప్రయత్నించేవారు. ఇక, లాల్‌బహదూర్‌శాస్త్రి సరేసరి!

కాగా, అమెరికా మూడవ అధ్యక్షుడైన థామస్ జెఫర్సన్ నిరాడంబరత్వానికి మరో పేరని చెప్పవచ్చు, అమెరికా అధ్యక్షుడైన తరువాత కూడా ఆయన యథాప్రకారంగా నిరాడంబరంగా వుండేవారు.

అంత నిరాడంబరత్వాన్ని—ఇప్పుడు మన దేశంలో సామాన్య ఉద్యోగులు సయితం ప్రదర్శించే అధికారపు హంగామా చూచిన తరువాత—అలాంటి నిరాడంబరులు వున్నారంటే నమ్మలేము.



ప్రెసిడెంట్ జెఫర్సన్ ఒకరోజున ఒక అమెరికన్ నగరంలో పెద్దహోటల్‌కు వెళ్ళి, తనకొక గది కావాలని అడిగాడు. అప్పుడు ఆయన వేష భాషలను చూస్తే, ఒక సామాన్య రైతు అనుకుంటారుకాని అమెరికా అధ్యక్షుడనుకోరు. ఆ హోటల్ యజమాని ఆయనను చూచి, ఒక సామాన్య రైతే అనుకుని "ఇక్కడ మీవంటి వారికి గదులివ్వ"రని చెప్పాడు!

జెఫర్సన్ వెంటనే అక్కడి నుంచి తిరుగు ముఖం పట్టాడు. ఆ హోటలు రిసెప్షన్‌లో వున్న మరొక వ్యక్తి కొంతసేపటికి ఆయన అమెరికా అధ్యక్షుడని గుర్తు పట్టి, ఆ విషయం యజమానికి చెప్పేసరికి ఆయన దిగ్భ్రాంతుడై, అప్పటికి కొంచెం దూరమే వెళ్ళిన జెఫర్సన్‌ను ఆహ్వానించడానికి ఇద్దరు ఉద్యోగులను పంపాడు.

వారు జెఫర్‌సన్‌ను కలుసుకుని, ఆయనను మామూలు రైతు అనుకున్నామని, క్షమించమని, తమ హోటల్లో ప్రత్యేకమైన గదిని ఇస్తామని, తమ వెంట రమ్మని ప్రాధేయపడ్డారు.

జెఫర్సన్ వారితో "మీ యజమానికి చెప్పండి— అమెరికా రైతుకు స్థానం లేని హోటల్‌కు అమెరికా అధ్యక్షుడు రాడని!" అనేసరికి వారు బిక్కముఖంతో తిరిగి వెళ్ళిపోయారు. ఒక సామాన్య రైతుకు లేని విలువ అమెరికా అధ్యక్షునికైనా వుండరాదని జెఫర్సన్ వుద్దేశం.

1776 జులై 4వ తేదీనాటి అమెరికా స్వాతంత్ర్య ప్రకటనను రచించింది జెఫర్సన్! "ఆల్ మెన్ ఆర్ క్రియేటెడ్ ఈక్వల్' అన్నది ఆ ప్రకటనలో అక్షర లక్షలు చేసే వాక్యం. అంటే దేవుడు మనుషులందరిని సమానంగానే సృష్టించాడని అర్థం. ఆ మాటను వ్రాయడమే కాదు, ఆచరణలో కూడా చూపించాడు థామస్ జెఫర్సన్!

## చర్చిల్ నోటికి పటేల్ తాళం

మన స్వాతంత్ర్యోద్యమ నాయకులలో సర్దార్ వల్లభాయ్‌పటేల్ ఉద్దండుడు. ముక్కుకు సూటిగా మాట్లాడడం, కఠోరమైన క్రమశిక్షణ, అకుంఠిత కార్యదక్షత ఆయనలోని విశిష్ట గుణాలు ఆయనను "ఉక్కు మనిషి" అనేవారు.

సర్దార్ పటేల్ అంటే ఆనాటి ద్వితీయశ్రేణి నాయకులకు భయభక్తులుండేవి. ఆయన తక్కువగా మాట్లాడి, ఎక్కువగా పని చేసేవారు. ఆయన ఉపన్యాసం కూడా స్పష్టంగా, సూటిగా, కుండ బ్రద్దలు కొట్టినట్టుండేది.

1947 జులై నెలలో బ్రిటిష్ పార్లమెంటులో భారత స్వాతంత్ర్యం బిల్లుపై చర్చ జరుగుతున్నది. ప్రధాని క్లిమెంట్ అట్లీ ఇక ఇండియాను బ్రిటన్ తుపాకులతో పరిపాలించలేదని, భారతీయులకు స్వాతంత్ర్య ప్రదానం చేసి, బ్రిటన్ చేతులు కడుక్కో రావడం మంచిదని పేర్కొన్నాడు.

వెంటనే ప్రతిపక్ష నాయకుడు, మాజీ ప్రధాని విన్‌స్టన్ చర్చిల్ లేచి, "నేనే కనుక ఇప్పుడు ప్రధానిగా వుంటే, 30 వేల మంది సైనికులను పంపి, భారతీయుల స్వాతంత్ర్యోద్యమాన్ని అణచిపారవేసి వుండేవాడినని గర్జించాడు.

ఈ వార్త వెలువడగానే "ఉక్కుమనిషి" సర్దార్ పటేల్ "30 వేలమంది కాదు, మూడు లక్షల మంది సైనికులను పంపినా మా స్వాతంత్ర్యోద్యమాన్ని అణచి వేయడం మీ తరం కాదు. ఇక ఇండియాలో మీ పప్పులుడకవు, ఖబడ్దార్!" అంటూ చర్చిల్ నోటికి తాళం వేశాడు.

"అంతేకాదు—ఇంతవరకు మిమ్మల్ని "క్విట్ ఇండియా" (ఇండియాను వదిలిపొండి) అంటున్నాము మళ్ళీ మాట్లాడితే, "క్విట్ ఆసియా" అంటాము — జాగ్రత్త!" అని కూడా సర్దార్‌జీ బ్రిటిష్ సామ్రాజ్యవాదులను హెచ్చరించారు.

పటేల్ అన్నట్టుగానే, 1947 ఆగస్టు 15న భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత బర్మా, శ్రీలంక మొదలైన తమ వలస దేశాలకుకూడా స్వాతంత్ర్య ప్రదానం చేసి, బ్రిటిష్‌వారు మూట ముల్లె కట్టుకుని ఇంగ్లాండ్ వెళ్ళిపోయారు.

అలా 1947 ఆగస్టులో భారతమాత వెలిగించిన స్వాతంత్ర్య జ్యోతి ఇతర బ్రిటిష్ వలసలకు కూడా మార్గజ్యోతి అయింది!

"వందేమాతరం! మనదే రాజ్యం"

## కేంద్ర అసెంబ్లీలో బాంబు!

స్వతంత్ర భారతి స్వర్ణోత్సవ వేడుకలు ముగిసిన సందర్భంగా ఈ స్వాతంత్ర్యం కోసం ఉరికంబమెక్కి ఆత్మార్పణ చేసిన అమరజీవి, విప్లవ వీరుడు సర్దార్ భగత్‌సింగ్‌ను స్మరించకపోతే, అది దేశ స్వాతంత్ర్యం కోసం ఆత్మార్పణ చేసిన ఎందరో విప్లవవీరుల మహత్తర త్యాగాన్ని కించపరచినట్టే కాగలదు.

అది 1929 ఏప్రిల్ 8వ తేదీ ఢిల్లీలోని కేంద్ర శాసనసభ భారత కార్మికుల ప్రయోజనాలకు భంగకరమైన ఒక బిల్లును చర్చిస్తున్నది. ఆనాటి సభా విశేషాలను తిలకించడానికి అసెంబ్లీ ప్రేక్షకుల గ్యాలరీలోకి ఎందరో ప్రముఖులు వచ్చారు. వారిలో సైమన్ కమిషన్ అధ్యక్షుడు సర్ జాన్ సైమన్, మరి ఆరుగురు ఆ కమిషన్ సభ్యులున్నారు. ఆ సభ్యులలో ఆ తరువాత బ్రిటిష్ ప్రధాని పదవిని అధిష్టించి, భారతదేశానికి స్వాతంత్ర్య ప్రదానం చేసిన క్లిమెంట్ అట్లీ కూడా వున్నారు.

ఉన్నట్టుండి, అసెంబ్లీ సభాభవనంలో చెవులు బ్రద్దలయ్యేటంత శబ్దంతో ఒక బాంబు ప్రేలింది! ఇంకేమున్నది? ఎక్కడి వారక్కడ చెల్లాచెదురయ్యారు. సైమన్ కమిషన్ సభ్యులు ప్రాణభీతితో ప్రేక్షకుల గ్యాలరీలోని బల్లల క్రింద దూరారు!

కేంద్ర శాసనసభాధ్యక్షుడు, "ఉక్కు మనిషి" సర్దార్ పటేల్ అన్నగారయిన విఠల్‌భాయ్ పటేల్ తన స్థానంలోనే కూర్చున్నాడు. సభా భవనమంతా బాంబు పొగతో, ఎవరు ఎక్కడ వున్నారో కనిపించడంలేదు. పోలీసులు, మార్షల్స్ వచ్చారు కాని, ఏమి చేయాలో ఎవరికి పాలుపోవడం లేదు. ఆ పొగ తెరలు తొలగగానే అక్కడ ఇద్దరు యువకులు "ఇంక్విలాబ్ జిందాబాద్! సామ్రాజ్యవాద్ నాశ్‌హో!" అంటూ నినాదాలు చేస్తూ నిలబడ్డారు. వారు పారిపోలేదు, నిర్భయంగా, గంభీరంగా నిలబడ్డారు. అప్పుడు పోలీసులు ధైర్యంగా వారివద్దకు వచ్చి అరెస్టు చేశారు! ఆ యువకులే— విప్లవవీరులు సర్దార్ భగత్‌సింగ్, ఆయన సహచరుడు బటుకేశ్వరదత్. వారిద్దరిని అరెస్టు చేసిన తరువాత కోర్టులో విచారణ ప్రారంభమైనది.

కోర్టులో భగత్‌సింగ్ ఒక ప్రకటన చేస్తూ ఇలా అన్నాడు.

"మేము ఎవ్వరినీ చంపదలచుకోలేదు. అలా చేయదలచుకుంటే సైమన్ కమిషన్ సభ్యుల పైనే బాంబు విసిరి, పారిపోయి ఉండేవారం. కాని, మేము పారిపోకుండా అసెంబ్లీ భవనంలోనే వుండి, స్వచ్ఛందంగా పట్టుబడ్డాము. ఒక్కరికి కూడా గాయం కాలేదు.

"మేము కేంద్ర శాసనసభలో బాంబు ప్రేల్చడానికి కారణం— బ్రిటిష్ ప్రభుత్వం తీవ్రమైన బధిరత్వంతో బాధపడుతున్నది. భారతీయులు ఏమి చెప్పినా, ఎంత చెప్పినా వారికి వినిపించడంలేదు. బాంబు ధ్వనికాని వారి చెవికెక్కేటట్టు లేదు. నిద్రపోతున్న బ్రిటిష్ ప్రభుత్వాన్ని మేల్కొల్పడానికే బాంబు ప్రేల్చాము. ఈ సంఘటనకు ప్రపంచమంతా ప్రచారం లభించింది బ్రిటిష్ ప్రభుత్వం చెవిటి చెవులకు మా బాంబు ధ్వని సోకింది. మాకు కావలసింది ఇదే!"

కేంద్ర శాసనసభలో బాంబు ప్రేలుడు తరువాత కోర్టులో భగత్‌సింగ్ వాంగ్మూలం యావద్భారత జాతిని కదిపివేసింది.

కేంద్ర శాసనసభలో బాంబు ప్రయోగమే కాక, **1928**లో "పంజాబ్ కేసరి" లాలా లజపతిరాయ్ మృతికి కారకుడైన బ్రిటిష్ పోలీసాఫీసరు శాండర్స్ హత్య కేసులో కూడా నిందితులైన భగత్‌సింగ్, రాజగురు. సుఖదేవ్‌లకు కోర్టు ఉరిశిక్ష విధించింది. కేంద్ర శాసనసభలో బాంబు ప్రయోగంలో భగత్‌సింగ్‌తోపాటు సహ నిందితుడైన బటుకేశ్వరదత్‌కు యావజ్జీవ శిక్ష విధించారు.

క్షమాభిక్ష కోరుకుంటే భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్ విప్లవ వీరత్రయానికి శిక్ష తగ్గిస్తామని బ్రిటిషి ప్రభుత్వం పేర్కొన్నది. అయితే, ఇందుకు ఆ విప్లవవీర త్రయం అంగీకరించలేదు.

"ఇది పిడికెడు మట్టి. ఈ మట్టి మట్టిలో కలిసిపోతుంది. మా మాతృదేశ దాస్య శృంఖలా విచ్ఛేదనకు మేము ఆత్మార్పణ చేయదలచాము. మేము కార్చే ఒక్కొక్క రక్తపుబొట్టునుంచి వేలాది దేశభక్తులు ఉద్భవించి దేశమాత సంకెళ్ళను ఛేదిస్తారు." అని భగత్‌సింగ్ చేసిన ప్రకటన ఆనాడు దేశభక్తులను, యువలోకాన్ని కదిపి, కుదిపివేసింది.

చివరికి **1931** మార్చి 23వ తేదీన భగత్‌సింగ్‌కు, ఆయన సహచరులిద్దరికి ఉరిశిక్ష అమలుపరిచే రోజు.

భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌లు ఉరిత్రాడును స్వయంగా తమ కంఠాలకు తగిలించుకున్నారు. "విప్లవం వర్ధిల్లాలి! సామ్రాజ్యవాదం నశించాలి. భరతమాతకు



జై!" అంటుండగానే వారి కాళ్ళక్రింద బల్ల తొలగిపోయింది. ఆ దేశ భక్తుల ప్రాణ వాయువులు అనంత వాయువులలో కలిసిపోయాయి. భారత స్వాతంత్ర్య చరిత్ర పుటలలో భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌ల పేర్లు సువర్ణాక్షరాలతో లిఖితమైనాయి.

తరువాత వారి భౌతిక కాయాలను బంధువులకు కూడా ఇవ్వకుండా బ్రిటిష్ ప్రభుత్వం వాటిని జెయిలు ఆవరణలోనే కాల్చివేసి, ఆ బూడిదను నదీజలాలలో కలిపి వేసింది. దేశం కోసం ప్రాణత్యాగాన్ని మించిన త్యాగమేమున్నది?

## తుపాకి గుండుకు గుండె చూపిన జోదు

కేంద్ర శాసనసభలో భగత్‌సింగ్ బాంబు ప్రేల్చినప్పుడు అక్కడ ప్రేక్షకుల గ్యాలరీలో సైమన్ కమిషన్ సభ్యులున్నారని ఇప్పుడే చదివాము.

భారతదేశానికి స్వాతంత్ర్యం ఇవ్వవచ్చునా? ఇస్తే ఏ మేరకు ఇవ్వవచ్చు? స్వాతంత్ర్యానికి భారతీయులు అర్హులేనా? అన్న విషయాలను పరిశీలించడానికి బ్రిటిష్ ప్రభుత్వం సర్ జాన్ సైమన్ అధ్యక్షతన ఒక కమిషన్‌ను నియమించింది.

"మాకు స్వాతంత్ర్యం పొందే అర్హత వుందో, లేదో నిర్ణయించడానికి సైమన్ ఎవరు? కమిషన్ దేనికి? అందులోను భారతీయులకు ప్రాతినిధ్యం లేని ఈ కమిషన్‌ను భారతీయులు బహిష్కరిస్తా"రంటూ భారత జాతీయ కాంగ్రెసు ఒక తీర్మానం చేసింది.

ఆ ప్రకారం భారతదేశంలో సైమన్ కమిషన్ ఎక్కడ అడుగు పెట్టినా దాన్ని బహిష్కరిస్తున్నారు.

అది **1928** ఫిబ్రవరి 3వ తేదీ. సైమన్ కమిషన్ బొంబాయిలో అడుగిడిన రోజు. యావద్భారతంలో వలెనే మద్రాసులోకూడా ఆ రోజు హర్తాళ్ చేస్తున్నారు. ఏ వంక చూచినా "సైమన్ గోబ్యాక్!" అన్న నినాదాలతో మద్రాసు నగరం ప్రతి ధ్వనిస్తున్నది మద్రాసు నగరంలో **144** వ సెక్షన్ విధించారు.

మద్రాసు హైకోర్టు సమీపంలో కూడా వేలాది ప్రజలు గుమికూడారు. **144**వ సెక్షన్ ధిక్కరించి, "సైమన్ గోబ్యాక్!" అంటూ నినాదాలు చేస్తున్నారు.

ఆ నినాదాలతో హైకోర్టు పరిసరాలు దద్దరిల్లిపోతున్నాయి. ఇంతలో అక్కడికి అదనపు సైనికులు, పోలీసు బలగాలు వచ్చాయి. జనాన్ని చెదిరి పొమ్మని ఆదేశించారు. కాని ఒక్కరూ కదలలేదు

"గోలీమారో!" అన్నాడు ఆఫీసరు. సిపాయి చేతిలో తుపాకి ప్రేలనే ప్రేలింది. పార్థసారధి అనే యువకుడు నేల కొరిగాడు అతడిని సమీపించడానికి ఒక్కరికీ గుండెలు చాలడం లేదు. "దాహం! దాహం!" అంటూ అతడు సైగ చేస్తున్నాడు. "ముందుకు వస్తే కాల్చి వేస్తా"మని సిపాయిలు బెదిరిస్తున్నారు. ఆ అపారజన సందోహం ఏమి చేయడానికీ తోచక, ఆవేశం పట్టలేక, ఆగ్రహాన్ని ఆపుకోలేక, బారుచేసి వున్న వందలాది తుపాకులవంక చూస్తూ నిలబడిపోయారు. ఆ ప్రాంతమంతా నిశ్శబ్ద గంభీర విషాద వాతావరణం అలముకున్నది.

ఇంతలో వారి ఆవేశానికి, ఆగ్రహానికి, ప్రతినిధిగా అజానుబాహుడైన అరవై సంవత్సరాల వ్యక్తి సైనికుల తుపాకి గుండ్లకు గుండె చూపిస్తూ అప్పటికి మృత వీరుడైన పార్థసారధి భౌతిక కాయంవైపు గంభీరంగా నడిచి వెడుతున్నాడు.

సైనికులలో కలవరం హెచ్చింది. ప్రజలలో హాహాకారాలు చెలరేగాయి. "కాలు కదిలితే ఇక కాల్చివేస్తా"మని సైనికులు కేకలు పెడుతున్నారు. "ఇక ముందుకు వెళ్ళకండి, కాల్చివేస్తారు!" అని ఆందోళనతో ప్రజానీకం కేకలు పెడుతున్నారు.

కాని, ఆ వ్యక్తి అవేమీ లెక్కచేయకుండా గంభీరంగా ముందుకు వెడుతున్నాడు. ఆగ్రహోదగ్రుడైన ఆఫీసరు "గోలీమారో!" అని అరిచాడు.

"గుండె వుంటే కాల్చండిరా!" అని ఆయన తన చొక్కా విప్పి, ఛాతీ చూపించాడు.

"ప్రకాశం! మా టంగుటూరి ప్రకాశం, మా ఆంధ్రకేసరి" అని ఒక్కసారిగా జనం గర్జించారు. ఆఫీసరు అదిరిపోయాడు. సిపాయి చేతిలో తుపాకి జారిపోయింది.

కాని, ఆ వ్యక్తి ఇవేమీ గమనించకుండా, "ఆంధ్రకేసరి జిందాబాద్!" అంటూ ప్రజలు భూనభోంతరాలు దద్దరిల్లేటట్లు చేస్తున్న నినాదాల మధ్య ఆ మృత



యోధుని వద్దకు వెళ్ళి, అతని పాదాలపై రెండు కన్నీటిబొట్లు రాల్చి జోహార్లు అర్పించాడు.

"ఆంధ్రకేసరి జిందాబాద్!" అంటూ ప్రజలు పెట్టిన కేకలతో ఆ మద్రాసు హైకోర్టు కుడ్యాలు ప్రతిధ్వనించాయి. అదీ-ఆంధ్రుల ఆరాధ్య నాయకుడు టంగుటూరి ప్రకాశం "ఆంధ్రకేసరి" అయిన వీరగాథ! ఆగస్టు 23వ తేదీ "ఆంధ్రకేసరి" జయంతి.

## తారకేశ్వరికి లోహియా చురక

రాజకీయ నాయకులు చాలామంది ఎన్నికల సమయంలో ఓటర్లను దేవుని చూచినట్లు చూస్తారు. ఎన్నికయిన తర్వాత తామే దేవుళ్ళమనుకుంటారు. ఇక ఏ మంత్రో అయితే, కొందరి దర్శనమే దొరకదు. అయితే, అందరూ అలా వ్యవహరించరు.

ఇందులో రెండు కోవలకూ చెందిన మనస్తత్వాలను తెలిపే ఒక సంఘటన తెలుసుకుందాం.

డాక్టర్ రామ్ మనోహర్ లోహియా భారతదేశంలో కరడు కట్టిన సోషలిస్టు నాయకులలో ఒకరు. స్వాతంత్ర్యోద్యమంలోను, ఆ తరువాత కూడా ఆయన ఎన్నో ప్రజా ఉద్యమాలు నిర్వహించి, చాలాసార్లు జెయిలుకు వెళ్ళారు.

పోతే, శ్రీమతి తారకేశ్వరి సిన్హా కేంద్ర మంత్రిగా ఉన్నారు.

ఒకసారి డాక్టర్ లోహియా, శ్రీమతి తారకేశ్వరిసిన్హా ఒకే కారులో పార్లమెంటుకు వెడుతున్నారు. దారిలో జనసమూహం తేనీరు త్రాగుతున్న ఒక షాపు చూసి "కారాపండి. ఇక్కడి టీ చాలా బాగుంటుంది. చౌక కూడా. ఒక కప్పు తాగి వెడదాం" అన్నారు లోహియా!

వెంటనే బాగా సంపన్న కుటుంబానికి చెందిన తారకేశ్వరిసిన్హా "ఇక్కడా టీ త్రాగేది! ఆ జనంతోనా? మన పరువేమౌతుంది?...." అన్నది ఆ జనాన్ని చూచి ఏవగింపుగా.

అప్పుడు లోహియా "ఇక్కడే నేను రోజూ టీ త్రాగేది! అయినా, ఈ జనమే కదా మనల్ని పార్లమెంటుకు పంపింది. వారంటే చులకన దేనికి?" అని మందలించారు.

మన రాజకీయవేత్తలలో రెండు రకాలవారి మనస్తత్వానికి ఈ సంఘటన అద్దం పడుతున్నది.

## నెహ్రూ బట్టతలపై జోక్

మన పార్లమెంటులోను, అసెంబ్లీలలోను హాస్యరసజ్ఞతకు కొదవలేదు. చైనా దురాక్రమణ సమయంలో ప్రధాని నెహ్రూ పార్లమెంటులో మాట్లాడుతూ "చైనా ఆక్రమించుకున్న మన భూభాగం ఒక్క గడ్డిపరక కూడా మొలవని మరుభూమి. దాన్ని గురించి మనం బాధపడనక్కరలేదు" అన్నారు.

వెంటనే మహావీరత్యాగి లేచి, "మీ నెత్తిమీద ఒక్క వెంట్రుక కూడా లేదని దాన్ని ఎవరైనా తీసుకుంటామంటే పూరుకుంటామా?" అనేసరికి నెహ్రూతో సహా అందరూ గొల్లున నవ్వారు. పండిట్ నెహ్రూ మంచి హాస్యరసజ్ఞుడు. బహుశా రాజీవ్‌గాంధీ ఇంకా హాస్య చతురుడేమో!

## చాలీ చాలని నెహ్రూ జీతం

ఆ రోజుల్లో అగ్ర నాయకులు నీతి నిజాయితీలకు మరో పేరుగా భాసిల్లేవారు. వారిని వ్రేలెత్తి చూపగలిగే అవకాశం ఎవరికీ లభించేది కాదు.

ఉదాహరణకు, ముఖ్యమంత్రి పదవి నిర్వహించి దిగిపోయిన తరువాత కూడా శ్రీ దామోదరం సంజీవయ్య రిక్షాపై తిరిగేవారు. ప్రతిపక్ష నాయకుడుగా వున్న పుచ్చలపల్లి సుందరయ్యగారు సైకిలుపై అసెంబ్లీకి వెళ్ళేవారు.

మరి ప్రధానిగా ఉన్న సమయంలో కూడా పండిట్‌నెహ్రూ ఆర్థికంగా ఎన్ని ఇబ్బందులు పడేవారో! జీతం చాలక అప్పులపాలయ్యేవారు.

ఒకసారి-ప్రముఖ రచయిత, చిత్ర నిర్మాత దర్శకుడు క్వాజా అహమ్మద్ అబ్బాస్ నిర్మించిన "మున్నా" చిత్రం చూచి, అందులో నటించిన బాలనటుడు రోమి



నటనకు ముగ్ధుడై ఆ బాలుని మరునాడు తమ ఇంటికి అల్పాహార విందుకు ఆహ్వానించారు ప్రధాని నెహ్రూ.

అక్కడ వున్న ఇతర నటీనటులు, సాంకేతిక నిపుణులు ప్రధాని ఇంటిలో అల్పాహారం కదాని ఆయన ఆహ్వానించకుండానే తాము కూడా అల్పాహారవిందుకు వస్తామన్నారు. ప్రధాని కాదని ఎలా అంటారు? రండన్నారు.

మరునాడు తన ఇంటికి బిలబిల మంటూ "బ్రేక్‌ఫాస్ట్"కు వచ్చిన ఆ సినిమా బృందాన్ని చూచి, కుమార్తె ఇందిరాగాంధీని నెహ్రూ ప్రక్కకు పిలిచి "అనుకోకుండా ఎక్కువమంది అతిథులు వచ్చారు. వీరికి సరిపడిన ఫలహారాలు చేయడానికి చాలినన్ని సరుకులున్నాయా?" అని అడిగాడు.

ఆమె ఏదో విధంగా సర్దుబాటు చేస్తానని చెప్పి, ఇబ్బంది లేకుండా అందరికీ వడ్డించింది.

ఇది గ్రహించిన అబ్బాస్, ఇందిరాగాంధీతో "డాడీ ఫలహారాలకు సరిపడా సరుకులున్నాయా? లేవా? అన్నారు. అది నిజమా? ఎగతాళా?" అని ప్రశ్నించారు.

"ఎగతాళి కాదు-నిజమే. నాన్నగారి జీతం ఇంటి ఖర్చుకే సరిపోవడంలేదు. సరుకుల కొట్టులో ఇవ్వవలసిన బాకీని సంవత్సరానికి ఒకేసారి తన పుస్తకాలపై వచ్చే రాయల్టీ సొమ్ముతో నాన్నగారు తీరుస్తుంటారు" అని ఇందిర చెప్పేసరికి అబ్బాస్ ఆ నమ్మలేని నిజానికి నిర్ఘాంతపోయాడు. ఔను దేశప్రధాని కిరాణా కొట్టులో బాకీ తీర్చలేకపోవడమా? ఇప్పుడు అలాంటి పరిస్థితిని అతి చిన్న పదవిలో వున్నవారి విషయంలోనైనా ఊహించగలమా?

## టిక్కెట్టు లేని ప్రయాణీకుడు జయప్రకాష్

"లోకనాయక్"గా పేరొందిన జయప్రకాష్ నారాయణ్ నీతికి, నిజాయితీకి మరో మహాత్ముడని చెప్పవచ్చు. ఆయన కాంగ్రెసు సోషలిస్టు పార్టీ వ్యవస్థాపకుడు. స్వాతంత్ర్యోద్యమంలో ఎన్నోసార్లు జైలుకు వెళ్ళారు. ఆయన రాజకీయాలను, కాంగ్రెసును అంటిపెట్టుకుని ఉంటే, పండిట్‌నెహ్రూ తరువాత ప్రధాని కావలసినవారు. నిజానికి 1953లో ప్రధాని నెహ్రూ జయప్రకాష్‌కు కేంద్రంలో ఉప ప్రధాని పదవి ఇవ్వజూపారు. అయితే, ఆయన నిరాకరించారు.

స్వాతంత్ర్యోద్యమ సమయంలో జయప్రకాష్‌చేతిలో చిల్లిగవ్వలేకుండా ఇబ్బందులు పడ్డరోజులు అనేకం. టిక్కెట్టు లేకుండా అనేకసార్లు అవసరం కొద్దీ రైలు ఎక్కి, తీరా టిక్కెట్ కలెక్టర్ పట్టుకుంటే జేబులోని పెన్నో, చేతి గడియారమో అతనివద్ద కుదువపెట్టి, తరువాత స్టేషన్‌లో దిగగానే తనకు స్వాగతమివ్వడానికి వచ్చిన వారినుంచి సొమ్ము తీసుకుని తన వస్తువును వదిలించుకునేవారు.

ఒకసారి ఎక్కడినుంచో ఆయన పాట్నా వెళ్ళాలి. చేతిలో చిల్లిగవ్వ లేదు. అయినా, ఆ రైలుకే వెళ్ళక తప్పదు. తీరా రైలు ఎక్కి కొంతదూరం వెళ్ళిన తరువాత కలెక్టర్ వచ్చి "టిక్కెట్! టిక్కెట్" అంటే టిక్కెట్ ఏదీ!

టిక్కెట్ సొమ్ము ఇస్తే కాని రైలు దిగడానికి వీలులేదని ఆ టికెట్ కలెక్టర్ పట్టుపట్టాడు. ఇప్పుడయితే కొందరు పదో, పరకో చేతిలో పెడితే వదిలేస్తారని చాలామంది స్వానుభవం.

ఇంతలో పాట్నా స్టేషన్ వచ్చింది. జయప్రకాష్ నారాయణ్‌కు స్వాగతమివ్వడానికి వందలాది అభిమానులు, బీహార్ సోషలిస్టునాయకుడు శ్రీ గంగాశరణ్ సిన్హా పాట్నా స్టేషన్‌కు జయ జయ ధ్వానాలు చేస్తూ వచ్చారు.

"స్వాగతం మాటతరువాత చూద్దాం. ముందు నా టిక్కెట్ డబ్బు కట్టి, నన్ను విడిపించండి" అని జయప్రకాష్ నవ్వుతూ అనేసరికి అక్కడివారు నివ్వెరపోయారు!

* * * *

మన స్వాతంత్ర్యోద్యమ నాయకులలో నేతాజీ సుభాష్ చంద్రబోస్ గొప్ప నాయకుడే కాదు. మహా వీరుడు, అహింసాయుత విధానాల ద్వారా భారత దేశానికి స్వాతంత్ర్యం ఇక రాదని, దాదాపు వంద సంవత్సరాలుగా స్వాతంత్ర్యం కోసం మనం అఘోరిస్తున్నా, బ్రిటిష్ సామ్రాజ్య వాదులకు తలకెక్కడం లేదని, సాయుధ పోరాటం ద్వారానే స్వాతంత్ర్యాన్ని సాధించ గలమన్న నిర్ణయానికి బోసుబాబు వచ్చి, తనను బ్రిటిష్ ప్రభుత్వం గృహ నిర్బంధంలో వుంచగా, మారు వేషంలో పోలీసులు, గూఢచారుల కన్ను గప్పి, చెవిటివాని వలె నటిస్తూ అప్పటి సోవియట్ రష్యాకు చేరుకుని జపాన్, జర్మనీల అధినేతలతో ఇండియా స్వాతంత్ర్యాన్ని గురించి చర్చించి, చివరికి జర్మనీ నుంచి 90 రోజులపాటు జలాంతర్గామిలో అడుగడుగునా బ్రిటిష్ నౌకల నుంచి తప్పించుకుంటూ, సింగపూర్ చేరుకుని అక్కడ



అజాద్ హింద్‌ఫౌజ్‌ను నెలకొల్పి-1947 ఆగస్టు 15కు పూర్వమే-1943అక్టోబర్ 21న ఇండియాకు స్వాతంత్ర్యాన్ని, బ్రిటిష్ ప్రభుత్వంపై యుద్ధాన్ని ప్రకటించిన స్వాతంత్ర్య మహాయోధుడు నేతాజీ సుభాష్ చంద్రబోసు.

## కోటి రూపాయల పూలమాల

ఆ సందర్భంగా ఆయనకు వేసిన ఒక పూలమాలను వేలం వేయగా. ఒక పంజాబీ యువకుడు కోటి రూపాయలకు కొన్నాడు! ఆ స్వతంత్ర భారత ప్రభుత్వానికి విరాళాల కోసం నేతాజీ విజ్ఞప్తి చేయగా, దాదాపు నాలుగు వేల కోట్ల రూపాయలను ఆగ్నేయాసియా దేశాలలోని భారతీయులు ఇచ్చారు!

అంతటి స్వాతంత్ర్య యోధాగ్రణి 1945 ఆగస్టు 22వ తేదీన విమాన ప్రమాదంలో మృతి చెందినట్టు ఆయన అనుచరుడు కెప్టెన్ షానవాజ్‌ఖాన్ అధ్యక్షతన నియమించబడిన విచారణ సంఘం నిర్ధారించినా, ఇంకా ఆయన మృతిపై అనవసర వివాదాలను రేపి ఆయనకు మరణానంతరం ఇండియా ప్రభుత్వం ప్రకటించిన "భారతరత్న" అవార్డును కూడా కొందరు వివాదాస్పదం చేయడం శోచనీయం.

దేశభక్తులు ఎక్కడ వున్నా, వారి హృదయాలలో ఆ మహావీరుడు చిరంజీవే!

## మన పేరు ప్రఖ్యాతులు ఎంత దూరం?

ఎంత గొప్పవారయినా, వారి పేరు ప్రఖ్యాతులు ఎంత ప్రాచుర్యం పొందినా వారి పేరు విననివారు చాలామంది వుంటారు. అది తెలుసుకోలేని వారు తమ పేరు తెలియని వారే వుండరని విర్రవీగుతూ వుంటారు; అహంకరిస్తూ వుంటారు.

చార్లీచాప్లిన్ ప్రపంచ ప్రఖ్యాత నటుడు.. ఒకసారి మహాత్మాగాంధీ యూరప్ వెళ్ళినప్పుడు ఎవరో చార్లీచాప్లిన్ పేరు ప్రస్తావిస్తే, ఆయనెవరో తనకు తెలియదని మహాత్మాగాంధి అన్నారు.

1945లో కాబోలు, మహాత్మాగాంధీ పేరు భారతదేశమంతటా మార్మ

ప్రమోగుతున్న సమయంలో అమెరికా నుంచి వచ్చిన ఒక విలేఖరి మైసూరులో ఒక ప్రముఖ రైతును మహాత్ముని గురించి అడిగితే మహాత్ముడెవరో నాకు తెలియదు కాని, మా మైసూరు మహారాజు మాత్రం తెలుసు"నన్నాడట!

ఒకసారి బ్రిటిష్ ప్రధాని హెరాల్డ్ మాక్మిలన్ ఆస్ట్రేలియా పర్యటనకు వెళ్ళాడు. విక్టోరియా రాష్ట్రంలో రైలు స్టేషనులో ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి మాక్మిలన్‌కు స్వాగతం చెప్పి, ఆయన బసకు తీసుకు వెడుతున్నాడు. దారి కిరుప్రక్కల అసంఖ్యాకంగా జనం గుమిగూడి వున్నారు.

అంతటి జన సందోహాన్ని చూసి ఆ బ్రిటిష్ ప్రధాని ఉప్పొంగిపోయి "మిష్టర్ చీఫ్ మినిష్టర్! నాకు మీ దేశంలో ఇంతటి అపార ప్రజాభిమానం వున్నదని, నన్ను చూడ్డానికి ఇంత మంది వస్తారని, అనుకోలేదు" అని సంతోషంగా అన్నాడు.

ఆ ముఖ్యమంత్రి 'ఔను!' అంటే పోయేది: మాక్మిలన్ సంతోషించేవాడు. ఆయన వూరుకోకుండా 'అబ్బే! ఈ జనం మిమ్మల్ని చూడ్డానికి కాదండీ వచ్చింది. వీళ్ళ మద్యం పర్మిట్ల కాల పరిమితి ఈ రోజుతో అయిపోతుంది అందువల్ల, వాటిని పునరుద్ధరించుకోడానికి వచ్చారు!' అనేసరికి మాక్మిలన్ ముఖం చిన్నబోయింది!

## దేశభక్తుల దుస్థితి

మన స్వాతంత్రోద్యమ సమయంలో "వందేమాతరం" గీతం వలెనే మరొక గీతం తెలుగు వారిని ఉర్రూతలూగించింది. అనాడు ఆంధ్రదేశంలో మారుమూల పల్లెల్లో కూడా ఆ గీతం వింటేచాలు, దేశభక్తులు ఉప్పొంగేవారు; బ్రిటిష్ అధికారులు ఆగ్రహోదగ్రులయ్యేవారు. ఆ గీతాన్ని సైక్లోస్టయిలు తీసి ఒక అణాకు అమ్మినందుకే ఆచంట సత్యనారాయణ అనే దేశభక్తునికి బ్రిటిష్ ప్రభుత్వం ఒక సంవత్సరం జెయిలు శిక్ష విధించింది!

అ గీత రచయిత పేరే—గరిమెళ్ళ సత్యనారాయణ. "మాకొద్దీ తెల్లదొరతనం" అన్న ఆ గీతం పేరు వింటే హడలిపోయి, చిందులు త్రొక్కే బ్రిటిష్ తాబేదార్లు ఆ గీత రచయిత నోరుముయ్యకపోతే ఆంధ్ర ప్రాంతంలో ప్రభుత్వాధికారులకు మంచినీళ్ళు పుట్టేటట్టు లేవని ఆనాటి గోదావరి కలెక్టర్ బ్రెకన్‌కు ఫిర్యాదు చేశారు.



దానితో కలెక్టర్ బ్రెకన్ గరిమెళ్ళ వారిని ఆనాటి గోదావరి జిల్లా ముఖ్య పట్టణమైన రాజమండ్రి పిలిపించి, తమ అధికారులను అంతగా బెదర గొడుతున్న ఆ పాట పాడవలసిందిగా కోరారు.

గరిమెళ్ళవారు కవి మాత్రమే కాదు—మంచి గాయకుడు కూడా. ఆయనది గంభీరమైన కంచు కంఠం. గొంతెత్తి ఆ జాతీయ ప్రజాకవి మహోచ్చ స్వరంలో ఆ దేశభక్తి గేయాన్ని "మాకొద్దీ తెల్లదొరతనం" అంటూ పాడేసరికి ఆ తెల్లదొరకే గుండెల్లో గుబులు బయలుదేరింది!

"తెలుగుభాష రాని నాకే మీ నోట పలికిన ఈ పాట ఆవేశం రేకెత్తిస్తున్నది. ఇక భాష వచ్చిన వారు వింటే యెంత ఉత్తేజితులవుతారో నేను వూహించుకోగలను. మీరు బయట వుండడం మంచిది కాదు!" అంటూ ఆయనను వెంటనే జెయిలుకు పంపించాడు ఆ తెల్లదొర!

ఆ మహా దేశభక్తుడు చివరి రోజుల్లో తిండికి లేక, మద్రాసు వీధులలో యాచించుకుంటూనే కన్ను మూశాడు—కటిక దారిద్ర్యంతో!

ఆయనే కాదు—నేడు తెలుగునాట, తెలుగునోట తరచుగా వినిపించే "మా తెలుగు తల్లికి మల్లెపూదండ!" అన్న మధుర గేయ రచయిత శంకరంబాడి సుందరాచారిగారు కూడా చివరి రోజులలో కటిక పేదరికం మధ్యనే కన్ను మూశారు!

బ్రతికి వుండగా మజ్జిగ నీళ్ళయినా ఇవ్వరు కాని, మరణించిన తరువాత శిలా విగ్రహాలు వేయడంలో మొనగాళ్ళు మనవాళ్ళు.

## "ఆగస్టు 15" తెర వెనుక గాథ

మన స్వాతంత్ర్య ప్రదానానికి ఆగస్టు 15వ తేదీని యెవరు నిర్ణయించారు? బ్రిటిష్ ప్రభుత్వమా? కాదు భారత జాతీయ నాయకులా? కాదు. మరెవరు?

అనాటి ఇండియా ఆఖరు వైస్రాయి లార్డుమౌంట్ బాటెన్! 1947 ఫిబ్రవరి

20న బ్రిటిష్ ప్రధాని క్లైమెంట్ అట్లీ 1948 జూన్‌లోగా ఇండియా నుండి బ్రిటిష్ సైన్యాలు వైదొలగుతాయని, ఈలోగా భారతదేశానికి స్వాతంత్ర్య ప్రదానం జరుగుతుందని ప్రకటించాడు కాని, స్వాతంత్ర్య ప్రదానం తేదీని మాత్రం ప్రకటించలేదు.

కాగా, 1947 మే నెలలో వైస్రాయి మౌంట్‌బాటెన్ పత్రికా విలేకరుల గోష్ఠి ఏర్పాటు చేసినప్పుడు ఇండియాకు స్వాతంత్ర్యం ఏ రోజున ఇస్తారని ఒక విలేకరి ప్రశ్నించాడు. మౌంట్‌బాటెన్ కొంచెంసేపు ఆలోచించి "ఆగస్టు 15" అని ప్రకటించాడు. ఆగస్టు 15కు ప్రత్యేకత ఏమిటి. అంటే పూర్వం అడ్మిరల్ మౌంట్ బాటెన్ ఆగ్నేయాసియాలో మిత్ర రాజ్యాల సర్వసేనానిగా వున్నప్పుడు ఆగస్టు 15న జపాన్ సేనలు ఆయనకు లొంగిపోయాయి. ఆయనకు ఆగస్టు 15 జయప్రదమైన రోజు కాబట్టి, ఆ రోజును ఆయన ప్రకటించాడు!

అయితే, జోస్యాలు ఎంతవరకు నిజమవుతాయో తెలియదుకాని, కలకత్తాకు చెందిన ప్రఖ్యాత జ్యోతిష శాస్త్రవేత్త స్వామి మదనానంద అప్పుడే లార్డ్ మౌంట్ బాటెన్‌కు లేఖ వ్రాస్తూ అగస్టు 15 ఇండియాకు మంచిది కాదని, ఆరోజు స్వాతంత్ర్య ప్రదానం చేస్తే, భారతదేశానికి కరువు కాటకాలు, మత కల్లోలాలు తప్పవని హెచ్చరించారట. అయితే, అది మూఢ విశ్వాసమని త్రోసిపుచ్చి, ప్రధాని కానున్న పండిట్ నెహ్రూ కూడా మౌంట్‌బాటెన్ నిర్ణయాన్నే బలపరచారట. అదీ ఆగస్టు 15 కథ!

* * *

మహనీయుల జీవిత గాథలు మహోజ్వలమైనవి. మనమేమి చేయాలో ఆ కర్తవ్యాన్ని నిర్దేశించేవి ఆ మహనీయులు మనల్ని వీడిపోతూ మిగిల్చిన స్మృతులు చారిత్రక ప్రస్థానంలో చిరస్మరణీయమైన ఘట్టాలు.

అలాంటి మహనీయుల జీవిత ఘట్టాలలోని దేశభక్తి, త్యాగనిరతి, సమయస్ఫూర్తి, నీతిబోధకమైన సంఘటనలు అందరికీ అనుసరణీయాలు ఆవశ్యపఠనీయాలు.

....0....